# లోకోభిన్నరుచిః



భమిడిపాటి కామేశ్వరరావు

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో

రు 1/-

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# లోకోభిన్నరుచిః

భమిడిపాటి కామేశ్వరరావు

రు 1/-

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# విషయములు

# బస్తీరోడ్డు

"రోడ్డు" అనేది తెలుగువాళ్లు అప్రయత్నంగా వాడే ఇంగ్లీషుమాటల్లో ఒకటి. ఇంగ్లీషువారు మనకి పబ్లీగ్గా తెచ్చి పడేసిన పదార్థాల్లో రోడ్డుకూడా ఉంది. సాధారణంగా శకటాలు కూడా వెళ్లడానికి వీలుండి, రంగుమీరి ఉన్నప్పుడు మాత్రమే, ఏదేనా మార్గాన్ని రోడ్డు అంటారు. రోడ్డును గురించిన పుస్తకాలు తెలుగులో లేవు. ('నాకు తెలియదు' అనేకబురు చల్లగా చెప్పడానికి 'లేవు' అనేది అలంకారికం.) రోడ్డులాంటి అధమ విషయంగురించి రాస్తే, కావ్యంకూడా నీచంఅయిపోవచ్చుగదా అనే భీతిచొప్పున సమర్థులు దాన్ని వొదిలేసి ఉంటారు. కాని, ఆసంగతి తెలియకపోడంవల్ల గాబోను, అన్యభాషల్లో వాళ్లు రోడ్డును గురించి వందలాదిగా పుస్తకాలు ప్రచురించారు. మానవోపయోగకరంగా ఉండే వృత్తాంతాలు ఎవైనాసరే గ్రంథస్థం అయినప్పుడు పండితులు దుర్ముహూర్తంలేకుండా చూసుకుని క్షమించి పారెయ్యడం మంచిది. నేలబారురచన మాత్రం చెయ్యగల అస్మదాదులకి 'రోడ్డు' సరిపడ్డ విషయం. ఏమంటే, ఇందులో నేల విడిచి సాం అవసరం లేదు. చాలా పూర్వకాలంలోనే మనుష్యులు నడవడానికీ, గుఱ్ఱపుదళాలు వెళ్లడానికీకూడా, అనేకదేశాల్లో శాశ్వత మార్గాలు ఉండిఉన్నట్టు తెలిసినా, రోడ్డు అనేమాట పుట్టి ఆట్టేకాలం కాలేదు. ౧౭౩౬ లో

పార్లమెంటుసభకి ఓప్రభువు తనబండిమీద వెళుతూండగా, అప్పటి లండన్ బురదవీథుల్లో ఒకచోట ఉన్న ఊబిలో ఆయన బండీయూవత్తూ దిగబడి ఊరుకుండట. ఈరెండువందల ఏళ్లలోనూ, ఇతరదేశాల్లో జనం గోష్ఠినిగురించి చేసిన ఆలోచనా, చూపెట్టిన ఆచరణా, సాధించిన అభివృద్ధీ మనికి తెలుస్తూన్నప్పుడు, అందరూ గోష్ఠిని గురించి దుమ్మురేగేటట్టు ప్రచారంచేసుకుని కాంగ్రెసులు కూడా జరుపుతూన్నప్పుడు, గోష్ఠి అనేవిషయాన్ని మనం కొట్టి పారెయ్యడానికి వీల్లేదు — అసలు అనుకూలం కాళ్లకి చుట్టుకుని ఉండే విషయాన్ని పారెయ్యడం శక్యమూ కాదు, శౌర్యమూ కాదు. మరోకసంగతి: మానవులు కలిసిగాని జీవించలేరు. ఒంటరిగా జీవించగలవాళ్ళు ఉండవచ్చు, ఉన్నారు, వాళ్ళు మానవాతీతులు. పెద్దస్థలంలో కొద్దిమంది మాత్రంకలిసి పల్చపల్చగా ఉండేలాగు నివాసం అయిఉంటే దాన్ని గ్రామంఅనీన్నీ, కొద్దిస్థలంలో చాలామందికలిసి ఒత్తిడిగా నివసిస్తే దాన్ని బస్తీఅనీన్నీ అంటారు.

ఒకదేశంలో ఈచివరనుంచి ఆచివరకి ఉండే ప్రతిచిన్నస్థలం కూడా కామధేనువు లాంటిదైతే, ఆదేశంలో ఉండనున్న గ్రామాలసంఖ్యే ఎక్కువగాఉంటుంది, ఇంకా గ్రామాలు పుడుతూంటాయి. కాని, ఏదేనాదేశంలో చవిటిపర్రలూ, ఉప్పుటేరువులూ, ఇసకఎడార్లూ, బోడికొండలూ, గనక విస్తారంగా ఉంటే, జనం ఎక్కడబడితే అక్కడ నివసించడం అసంభవం అయి,

కొత్తగ్రామాలు పుట్టడానికి ఆస్కారంలేక, ఉన్నగ్రామాలే బస్తీలుగా మారడానికి యత్నిస్తాయి. ఈదేశం, వైశాల్యం ధర్మమాలని, ఏరకంలోనేనా సరే చేరుతుంది. ఇక్కడ లేని రకం ఉండదు. విస్తారం గ్రామాలూ ఉన్నాయి, కొత్తవి పుడుతూనూ ఉన్నాయి. కొన్ని బస్తీలుగానూ మారుతూ న్నాయి. స్థూలంగా చెప్పాలంటే, జనాభా ఒక పాతిక వేలకి దగ్గిరపడినా, లేక ఎంత వంకరటింకరదైనాసరే ఒక కంకర రోడ్డు దాంట్లోకి చొరబడినా, గ్రామంఅనేది బస్తీగా ముసురు తుంది. ఒక బస్తీనించి ఇంకోబస్తీ చేరుకోడానికికూడా ఘంటాపథాలు ఉంటాయి. ప్రస్తుతం వాటిసంగతి కాదు. ఒకేబస్తీలో ఉండేజనం, తమతమ వ్యవహారం సందర్భాలు మాపుగోవలిసిన అవసరం వచ్చినప్పుడు ఒక గృహందగ్గిర్నించి మరో గృహానికి వెళ్ళాలి. ఈరీతిగా ఘోషాజనం తప్ప కడం అందరూ వెడుతూంటారు. అందుచేత, ఇళ్ళమధ్యే వీధైనంత ఖాళీస్థలం అశేషజనం ఉమ్మడిగా వాడుకోడానికి కేటాయించి ఉంటుంది. అటువంటి బస్తీవీధిరోడ్ల సంగతి కొంచెం ముచ్చటించడమే ఇప్పుడు సంకల్పం.

రోడ్డు అనేపదార్థం మాయిమంత్రంవల్ల చిటికెలో తయా రయే బాపతు కాదు. దానికి కష్టసుఖాలన్ని చూపాంతరా లున్నాయి. వాటిని జన్మాంతరాలన్నా ప్రత్యవాయవు లేదు. అసలు దుర్గమస్థలంలో మొట్టమొదట కాలు పెట్టినవాడు సాహసుడయి ఉంటాడు. వాడిఉద్దేశం వాడికే తెలిసిఉంటుంది.

అంతో పెట్టిపుట్టింది అయిఉండాలి; అసలు, ఆవీధులో కాపరం ఉండే ప్రతీద్విపదుడూ మామూలు మనిషై ఊరు కోక, చివరకి ఏఒకడేనా బ్రహ్మచారిపాలకసంఘంలో ఒకసభ్యుడై ఉండాలి. రోడ్డులేనప్పుడు అతనికి ఉండే చికాకు మర్త్యుల్లో ఎవరికీఉండకూడదుట. లేకపోతే, అక్కడ కాపరంఉన్న వాళ్లల్లో ఒకడైనా ప్రభుత్వంవారి పరిచయుడైనా కావాలి, లేక ధనవంతుడైనా కావాలి, సలుపుగా చీరేవాడో, అడ్డంగా బాదే వాడో, లేక తెగతిట్టేవాడో, తెగ ఆశ్రయించేవాడో కావాలి. అవి కాకపోతే, ఒక గపర్నరుగారు అతనిలాంటి గొప్పమనిషిగాని ఆ వీధివెంట వెడతాడని తెలియాలి! ఆయన ఇక కేపోమెల్లుండో ఆదార్ని వెడతాట్టఅని తెలియడంతోటే, అతని మహిమవల్ల, రామపాదధూళి తగిలింతరవాత రాయి మనిషైనట్టు ఆయన పాదంచెప్పులో ఉండడం వల్లించి తప్పదధూళికైనా నోచుగోనైతిని గదాఅనిచెప్పేసి ఆదారి రాయిలా అయిపోతుంది. అది అట్లా అయిపోయేటప్పుడు ఇంతోటి విద్యార్యాని కేసి ఇస్త్రీబట్టలు కట్టేసి కుళ్లుజనంలాగ వెల్లవేసుకున్న ముదుగుతూములు తెలతెల్లపోతూ చూస్తూంటాయి. అదే అదను, మళ్లీదారకను, అసు కొన్నిదార్లు అప్పుడు కంకరకూడా అవుతాయి. పురపాలక సంఘంలో అందరూ కంక రనకపోవడంవల్ల, కొన్ని దార్లు ఎన్నటికీ కంకర రవనే అవవు. ఒక్కొక్కప్పుడు కంకర వృగిరా తెచ్చి, నడవడానికికుడా వీలులేకుండా ఎడాపెడా పొయ్యడం సమేతూ జరిగిపోతోంది. అప్పుడొస్తుంది ఎగే

సుగుని! ఆవీధుల్లో ఉన్నస్థలం స్థలంలా పడి ఉంటుందా, పైవాళ్ళి ఎదో పేచీపెడుతుందిగావును. దాంతోటి వాళ్ళకి తలో మోస్తరుగానూ ఆనేలమీద కోపంవచ్చి, ఆకసిగొన్న ఉన్న పళంగా వొదిలేస్తారు. అయితేం! ఉన్నపళంగా ఏదీ ఉండదు, కంకరా ఉండదు. కోతుల్ని కొట్టడానికీ, కాయలూ, పళ్లూ రాలగొట్టుకోడానికీ, పిల్లలు వాట్ని వాడేస్తారు. ఒక్కొక్కప్పుడు అవేట్టే వీథిదీపాల అద్దాలు పగలకొట్టి మునిసిపల్ వారిపనే చూస్తారు. పెద్దలుకూడా కాస్త చీకటడీ, మాటు మణిగింతరవాత, కాసికాసిని చొప్పున ఆరాళ్లని సెనగపప్పులా లగాయించేసి, అవీనూ, డబ్బిచ్చికొనుక్కున్న యజమానియింటికి ఇటికెలు తోలుకెళుతూన్న బండివాడు దయతో దానం చేసినయిటికెలూపెట్టి నిర్మాణ కార్యక్రమం సాగిస్తారు. అల్లా ఆరాళ్లన్నీ మాయం అయినా సరే ఒకొక్కవీధిలో నేలకి పాలకసంఘం అంటే భయం లేదు. జనం అంటే జాలిలేదు. ఇంకోసంగతి. ఈకాలంలో జనం తిన్నగా తిండేనా తినలేరనిన్నీ, వెనకటివాళ్లు రాళ్లు కుడా తిని హరాయించుకునే వారనిన్నీ కొందరు ముసిలాళ్లు కోస్తూంటారు. కాని, ఇప్పుడుకూడా కంకరరాళ్ళయొక్క విలువతినేసే రోడ్డునిర్మాతలున్నారని వాళ్లకు వివరించి చెప్పి, ముసిలాళ్లని పిన్నలు నెగ్గచ్చు. ఏమైతేం, కొన్ని అవస్థాభేదాలు పొంది దెబ్బలు, పోట్లు, నగుకులు, అరుపులు, నొక్కులు, తిట్లువగైరా తినితిని, చివరికి బస్తీరోడ్డు అవత

రిస్తుంది. సాధారణంగా ముంపుతవ్వి, మరీ పెద్దగోతులుంటే వాటిల్లో పెద్ద రాయెట్టి, చిన్నసైజు కోనురాయి సర్ది, ఎర్రకంకరో తెల్లకంకరో చిమ్మి, ఇసగపోసి, నీళ్లుచల్లి చేసేపద్ధతి అవలంబిస్తారు. (మహాబస్తీల విషయంలో, వాటికి వాడానికట్టి పలకరాతివీ, సిమెంటువీ, తారువీ, కర్రవీ రోడ్లు వెలుస్తాయి. వాటి ప్రమేయంకా దిప్పుడు.) రోజు గడవనివాళ్లూ, జీవితం నడవనివాళ్లూ వచ్చి, తక్కిన ప్రపంచం నడిచిపోవడం నిమిత్తం చెమటతో రోడ్లు వేస్తారు. కాని, ఎంతెంతటి శ్రమలుపడి వీటిని సృష్టిచేసినా, వీటిల్లోవీటికి బొత్తిగా జాత్యభిమానంలేదు, సోదరభావం లేదు.

వీట్లయొక్క రకాలకి హద్దులేదు. చాలా రకాలు మా ఊళ్ళోనే దొరుకుతాయని ప్రతీఊరి ప్రతీవాడూ విర్రవీగడమే, ఎవడిమాట నిజమో తేలకుండా. కొన్ని కేవలం గజం పన్నా రోడ్లు. తెలుగు లిపిలో తలకట్లు మూలబడడంచేత గజం అంటే ఏనుగు అనుకోగల్రు. కాని ఇక్కడి అభిప్రాయం "గజం" అనగా మూడడుగులు నేల — అయినా మళ్ళీ వామనుడు కోరినంత సైజుది కాదు! కొన్నిరోడ్లు మనిషి పన్నా — ఆ మనిషీనా భారీరకం అయితే పీతనడక నడిస్తేగాని అతనికి జరుగుబాటుండదు. కొన్నింటికి వక్రభావమేకాని ముక్కుకి సూటిగా పోదామని లేనేలేదు. ఈ సంగతే దొరకపుచ్చుకుని, చుట్టుప్రక్కల దొరికగల వక్రత్వం యావత్తూ తమ ఊరిరోడ్లే గుత్తకి తీసుగున్నాయనిన్నీ, అందులో మరేమీ

వాట్టా మిగలక పోడాన్నించి తమ ఊరి జనం అశేషం ఋజుమార్గవర్తులయి తీరవలిసొచ్చిందనిన్నీ, ఒకొక్క బస్తీ కవి బడాయి కొడుతూంటాడు. నాగరికిత ఎరగని రోజులుగనక పూర్వం 'సూత్రపట్టినట్టు' ఒక బస్తీవీథులు ఉండేవిట! ఇతర బస్తీలల్లో రోడ్లు దిక్కుమాలిన గోడ్లనిన్నీ తన ఊళ్ళోవి దిక్కున్నవనిన్నీ ఒక నగరప్రియుడు ఒకచోట ఒకచోట లేవదీశాడు. ఎంచేత అని అడిగేసరికి, 'దక్షిణానికు మాత్రము బండ్లుపోవాలి. పడమరకు మాత్రము జంతువులు కదలాలి' అని దిక్కు తెలుపుతూండే గోడ్లు తన ఊళ్ళోగాని లేవని అతడనుసమర్థించి నెగ్గుకు పోయాడు. కొందరు మనుష్యులకిమస్తే కాకుండా, కొన్ని గోడ్లు ఉచ్ఛ్వసించాలు గల ఘటాలు. అందుకని వాట్లమీదికి ఏదేనా బండీ వచ్చినప్పుడు, ఆరోడ్లు ఆంబోతుల్లాగ కోరమూపులు నూరాసి ఒడుపు కనిపెట్టి, ఆబండీని బోల్తాకొట్టిస్తాయి. ఒకవేళ ఏమరుపాటుగా నడుస్తూండే మనుష్యులు గనక వచ్చారా, వాళ్ళ కాళ్ళూ చేతులూ అధమం నడుమూ విరిచేస్తాయి. కొన్ని మరీ నిర్మొహమాటపు రోడ్లు మరీ హెచ్చుతగ్గుగా వ్యవహరించడం వల్ల ఒళ్ళల్లో జనం కొయ్యయిపోతూంటారు. 'అచేతనంబులు చేతనరీతి దనర, చేతనంబులచేతనభాతి నొనర' వీణ వాయింపు ఉన్నదని, ఒకకవి అన్నాడు. నేమకుడా చాలా పాటకచేరీలూ, కొన్ని రోడ్లమీద ప్రయాణాలూ అంతటివీ ఉన్నాయని మనం గర్వపడవచ్చును. కొన్నిగోడ్లుగల వీథుల్లో

కాపరంచేస్తే, ఎండాకాల వానకాలాల తేడాలు తెలియకుండా పోతాయనిన్నీ, రోడ్లే కాలవలుగా మారడంచేత, 'ఓడలు బండ్లవచ్చు బండ్లోడలవచ్చు' అనే మాటల్లో ఉండే సంశయత్వం పోతుందనిన్నీ కొందరన్నారు. కొన్ని రోడ్లమీద, మధ్యగా, మురుగు పోయేనిమిత్తం, ఒక్కగాడి ఉంటుంది. రోడ్డు దేవిగారి పాపిడి కాదుగదా అన్నట్టుగా. మండు వేసవిలోకూడా రోడ్డు మధ్యగా ప్రవహించే శక్తిగల మురుగుకాలవన్ని ధరించిన రోడ్లున్నాయి. వీటిని చూచినప్పుడు, పర్వతాల్లో పుట్టి మంచుకరగడంవల్ల వేసవిలో ఎక్కువ నీటితో ప్రవహించే నదులు జ్ఞాపకంవస్తాయి. ఎటొచ్చీ, నీటిలో నీరు ఘనీభవించిన కొళ్ళులో సమపాళంగా మిళితమై నల్లగా ఉండి 'కృష్ణ' స్మరణ చేయిస్తుంది. ఒకొక్క బస్తీలో అన్నిచోట్ల ఈ నలుపురంగులోనే కాకుండా అనేకమైన కంపుల్లోకూడా అద్వితీయమైన ఒప్పేటటువంటి కొన్నికొన్ని మైదుకాలవలకి విహారాది విషయాల్లో సక్రమమైన ట్రైనింగు ఇచ్చి, వాటిల్లోఉండే నీటిమహాత్యం అనుభవించకపోడంచేత పౌరులు చెడిపోతారేమో అనే బెంగ చొప్పున, అవి మరోచోటికీ మరోచోటికీ తమ యిష్టంవచ్చినట్లు వేచిపోకుండా, తమ ఆజ్ఞానుసారం, చేరువనున్న మంచినీటికాలవల్లో కలిసేలాగచేసి, జనం శ్రమించి అక్కడ దూరాంభారం వెళ్ళక్కర్లేకుండానే ఆ 'గంగాయమునా సంగమపుణ్యాదర్శనఫలం' జనానికి పన్నులేకుండానే మంజూరు చేసి, ఆజనం అట్లాంటి పుణ్యాన్నిపొంది జీవన్ముక్తులవడానికి

నానాతిప్పలూ పడుతూంటారు. కొన్నిరోడ్లు తమాషాగా కనిపించి, కొత్తవాణ్ణి బెదిరిస్తాయి. దాంతో ఆ కొత్తవాడు అనుమానిస్తూ నడుస్తాడు. అవి వాణ్ణి తిప్పి తిప్పి చివరికి ఎవరియింట్లోకేనా లాక్కుపోతాయో, లేక పీనులో పడేస్తాయో వాడికి తెలియదు.

బస్తీరోడ్డుయొక్క ప్రత్యేక విశేషం అయిన దుమ్ము గురించినది పెద్దఘట్టం. దుమ్ము నిరంతరంగా బస్తీలో విజృంభిస్తూ ఉంటుంది. బస్తీపాలకులు దాంతో యుద్ధంచేస్తూంటారు. వారు ఇతరవిషయం ఏదేనాసరే దుమ్ము రేగకొట్టగలుగాని విషయమే దుమ్మైన్న అదే రేగిపోయే దయినప్పుడు, ఏమీ చెయ్యలేక పోతూంటారు. అసలు దుమ్ము లేకుండా చేస్తే సరి, ఇహ నెల్లా రేగుతుంది దాని మొహం! అని, కొందరు సలహా ఇస్తారు. అందుకని, కొన్నిచోట్ల బస్తీరోడ్లు ఇళ్లూ వాకళ్లూ తుడిచినట్లుగానే చీపుళ్ళతో గంటలో తుడిచేస్తారు. దానిఫలితం ఏమీ అంటే ఇరవైనాలుగు గంటల్లో చుట్టుప్రక్కల గృహావృక్షాదులమీంద మలామా చెయించినట్లు సర్దుకునేదుమ్ము ఒకగంటలోనే గబగబా సర్దుకుంటుంది. ఈ పద్ధతిలో పథికులకికంటె సమీప గృహస్థుల కే ఎక్కువవాటా దుమ్ము కిట్టుతుంది. కొన్నిచోట్ల రోడ్లు నూతిలచేతా, కొన్నిచోట్ల కార్లచేతా, తడిపిస్తారు. మొదటి పద్ధతి చాలమందిని బీదవాళ్ళకి పని చెబుతుంది గనక, అంతమందికి జలక్రీడోద్యోగం ఇవ్వడం ఏమిటని చాలా బస్తీల్లో అది మానేశారు. ఒక్క

యంత్రప్రభావంవల్ల వెయ్యిమంది పనివాళ్ళు మూలపడతారు. అంచేత గావును బస్తీలో నీళ్ళకారు! దానికి చెయ్యబడిఉండే ఏర్పాటు మూలాన్ని కొతుఖానాలోంచిలాగ నీరు ఇటూ అటూ చటుక్కున చిమ్మొచ్చు, చటుక్కున ఆపచ్చు. ఆ అధికారం సాధారణంగా డ్రైవరు చేతిలో ఉంటుంది. కాని, ఆయంత్రం అతణ్ణికూడా దగాచేసి, తనఖులాసా చొప్పున పోతూండడం కూడా కద్దు. డ్రైవరు ఉద్యోగానికి కారకులైనవా రెవరైనా పక్కనించి పోతూంటే, అది చటుక్కున ఆగిపోతుంది. కాని, ఇతరబస్తీజనులుగాని, ఇతర గ్రామస్థులుగాని, స్త్రీలుగాని అయితే, పెద్ద-పిన్న ముసలి-పడుచు తారతమ్యం గమనించకుండా నీరు చిమ్మేస్తుంది. అందుకని, ఏకొద్దిమందో తప్ప తక్కినవారు నీటికారు ఎప్పుడు తననీటిముల్లు విప్పుతుందో - ఏదుబందిలాగ - అని భయం చొప్పున దూరాన్నించే జాగ్రత్త పడతారు. రోడ్డు తడపడం దుమ్ముని అణచడానికి. అప్పట్లో ఆపని నెరవేరినట్లు కనిపిస్తుంది. కాని, తడిపిన దుమ్ముమీద శకటాదులు వెళ్లడంవల్ల తెగనలిగి వస్త్రగాళితం చేసినట్టు మరీ కాటిగలా అయి, ఎండొచ్చి తడి ఇగిరింతరవాత, పూర్వం తాడిప్రమాణాన్ని లేచే, ఆ సాయంత్రానికి తారాజువ్వలా లేచి, తలపెట్టిన ఉద్దేశానికి విరుద్ధం ఫలించేటట్టు చేస్తుంది. ఇదిగాక, అలవాటుగా నీళ్ళు పోసేసరికి, రోడ్డుమీది మొరకవల్లాలు ఖాయపడి, సంవత్సరంలో బయల్దేరే కతకలు నెలలోనే సిద్ధిస్తాయి.

వెనకవేపున రోడ్డుబురద చిలకరింపు సంక్రమిస్తుంది. కేవలం స్లిప్పర్లు తొడుక్కొని తప్పు తప్పున నడిచేవాళ్ళకి, బాడి చింపులు బాగా చిమ్ముబడ్డి తప్పెల్లాగ లేచి నెత్తిదాకా వ్యాపించి యజమానికితప్ప తక్కిన అందరికీ కనిపిస్తూంటాయి. కొన్ని రోడ్లమీద మెత్తని కంకర, కాటికలాంటి అడుసులా తయారై, జనంకాళ్ళకి పట్టుగోడంలో, బస్తీలో ఉండే స్త్రీ పురుషాలు బస్తీపారాణి రాయించుకొని (పిలవని!) పేరంటానికి వెళుతూన్నట్లు తెలుస్తుంది. ఒక్కొక్కచోట, ఇంట్లోంచి ఇవతలకీ, ఇవతలనుంచి ఇంట్లోకీ వెళ్ళిపడడం అనేది క్రతువులాంటిపని అయిపోతూండడంచేత, అక్కడి యజమానులు తప్పనిసరి అయినప్పుడు తప్ప కొంపలోనే పడుండి, యథాశక్తి దేశాభిమానం అని చెప్పదగిన గృహాభిమానం నేర్చుకుంటూంటారు.

బస్తీరోడ్లవల్ల ప్రయోజనాలు ఒక్కమాటు చూసి పట్టెయ్యవచ్చు. రాత్రిభాగంలో కొందరు వయస్సొచ్చిన స్త్రీ పురుషులు తమయింటి ఎదరకాని రోడ్డుని బాహ్యానికి ఉపయోగించి ఆపని నెరవేర్చి రావడంలో తమరు ప్రకటించగలిగిన ధైర్య సాహసాలకీ తెలివితేటలకీ అభినందించుకునే వాళ్ళూ, తమ యింట్లో ఉండేజనంచేత మన్ననలూ స్తోత్రాలూ పొందే వాళ్ళూ ఉన్నారు. కొందరికి ఇంటి ఎదటిరోడ్డే తమకున్న ఖాళీస్థలం అవడంచేత స్నానాలూ తలంట్లూ రోడ్డుమీదే. భోజనాలకి, కజ్జాలకి, పురుళ్ళకి, పుణ్యాలకి, ఓకేమిటి సమస్తానికీ

కొందరికి పట్ల రోడ్డే ఆధారం. ఎండబెట్టుకోడాలన్నీ రోడ్డుమీదే. కొందరు పశువుల్ని పెంచడం, కట్టెయ్యడం — అంతా రోడ్డుమీదే. కొందరు తమయింటి ఎదటిరోడ్డుమీద తమహక్కు స్థాపించుకోడానికే తమయింటిరోడ్డుమీద కల్లాపు చల్లి ముగ్గెట్టడం. ఇతరులెవరూ దొంగతనంగా వేసినా పట్టికెళ్ళరుగదా అనే ధైర్యం కలిగించే వస్తువులన్నీ కొందరు రోడ్డుమీదే దాచుకోడం. కొన్నిరోడ్లమీద రాత్రిళ్ళు ఎడాపెడా పడే వేసంకాలపు మంచాలమధ్య కుక్కలుండీ, దారెంట వెళ్ళవలసినవాడు కాలెట్టడానికి అవకాశం ఉండదు. చాలా బస్తీరోడ్లమీద ఇటీవల బయల్దేరిన సోడాకొట్లవల్ల దారి మూసుకుపోతోంది — పూసిన తేలకాయలాగా. ఈ కొట్లు దేవదారువీ, కర్రవీ, క్రమేపి ఇనపవీకూడా అవుతున్నాయి. రోడ్డు ఎంత యిరుకైనాసరే, రథంలాంటి సోడాకొట్టు, పాలకసంఘానికి ఫీజు కట్టేసి, అక్కడే ఉన్నా ఇరుకుతుంది. ఒకటి పుట్టేసరికి దినదినాభివృద్ధిగా పిల్లల్ని పెడుతుంది. వీటిల్లో వంటకీ, భోజనానికీ, పడకకీ, విశ్రాంతికీ — అంతస్తులూ, బిలాలూ రహస్యమార్గాలూ అవన్నీ దుర్గానికి ఉన్నట్టు ఉంటాయి. వీటికి కిందచక్రాలు పెట్టేస్తున్నారు కొందరు, కొండలకిరెక్కలు పురమాయించినట్టు. ఈదెబ్బతో బస్తీకి రథాలులేని అపకీర్తిపోయేట్టు కనిపిస్తుంది.

అయితే, రోడ్డుగురించి ప్రథమసూత్రం ఏమిటంటే, గమనం కలిగిన జంతువులే కాకుండా చలనంగలిగిన పదార్థాలుకూడా

రోడ్డుని వాడుకోడానికి హక్కుగలవే, అని. కాని, ఎవరైనా సరే, వీలైనంత త్వరలో వాడుకుని ఇతరుల వాడకానికి దానిని వదిలేస్తూండాలి. అందుకనే, ఎంత తక్కువ కాలంలో దానిని వాడుకుని వదిలెయ్యగలవాడైతే, అంత పెందరాళే అదివాడుకోడానికి వాడికి మొదటిహక్కు ఏర్పడుతుంది. ఆ మొదటిహక్కులో ఉండేవయినం గమనించి పేచీలు రాకుండా గమనాలు నడిపించడం నిమిత్తమే కూడలి వీధుల దగ్గిరా, మలుపులదగ్గిరా, పోలీసుసోదరులు ఖణాయించి చేతులు — (అవి మీసాలుసర్దుకోడంలాంటి ఇతరపన్లో లేనప్పుడు) — తిప్పుతూండడం. ఈహక్కు పూర్వమాఅనే, ప్రపంచప్పు గొప్ప బస్తీలలో ప్రమాదాలు జరిగి రోజుకి సగటున నలుగురు మొదలు పదిమందిదాకా మనుష్యులు ఖర్చుపడుతూ ఉండడం. పోనీ, హక్కుమాట సరేగాని. మరి బాధ్యత ఎవరిది? అంటే, ఆమాట అంటేనే చాలమందికి కోపం! పైగా అది వేరే సంగతి!!

---

# శ్రేయోమార్గం - అభినందనం

రైలుయొక్క మార్గం అయోమార్గం అయినా, దాని యొక్క వ్యాపారంలో కొంత స్వార్థత్వం, కొంత పాడానిడిగుణాలు, కొంత కర్రపిడితనం ఉన్నా, అది అస్పృష్టసమగ్రగోపితం అయిన గాంధాభినయంలాగ, శుద్ధఅయోమయం కాదు. దాని సంగతి ఏకొంతో అందరికీ తెలుసు. అయితే, నిస్సందేహంగా, అయస్కాంతం వగైరాల శక్తులవల్ల దానికి గమనం సిద్ధిస్తుందనీ; దాన్లో భూమిని పట్టుకుపాకేరకం - భూగర్భం దొలుచుకుపోయేట్లు నిర్మించబడ్డ గొట్టాలలో చరించేరకం - భూమికి కొంత ఎత్తున స్తంభాలమీద వెళ్ళేరకం - ఒకేపట్టామీద పోగలిగేరకం - పట్టాలున్నా వాటిని తాకకుండా నడవగలిగేరకం - వగైరా ఉన్నాయనీ; దానిశాఖలు కొన్ని ప్రభుత్వాల కిందా, కొన్ని రాష్ట్రాల అధీనంలోనూ - కొన్ని పెడసంస్థలైన కంపెనీల చేతుల్లోనూ - ఉన్నాయనీ; ఎరుగున్నవిషయాలే! గమనానికి పట్టాలుండడం ప్రతిబంధకం అని కొందరు భావిస్తారు. స్థిరమార్గం నిర్ణీతం అయిఉండడం అనేది వేగాంతరసిద్ధికి దోహదకరం అని కొందరు నమ్ముతారు. మొట్టమొదట్లో రైలుపట్టాలు భూమండలంమీద పడి ఇప్పటికి నూరేళ్ళు నిండి పుష్కరం దాటింది. ఆ భాగ్యం పొందిన పుణ్యస్థలం సీమ దేశము. ఆ స్థలంలో రైల్వేశతాబ్దోత్సవం జయప్రదంగా జరపాలని (వార్తా పత్రికారచనలో జయప్రదంకాని సంభవమే ఉండదు!) ప్రయ

త్నాలు చేశారని చెప్పుకుంటారు. ఇండియాలో రైల్వేసహా ప్రపంచోత్సవం పెట్టించాలని చాలామంది తంటాలు పడ్డట్టు తెలుస్తోంది. దకీఅంచూ తెలియని మహాకాలంలో సంస్థల యొక్క పర్వోత్సవాలు జరపడంలో తిథివారనక్షత్రాలతో సహా అసలుదినం గమనించక్కర్లేదనే విశాల భావంతో కొందరు, వీలునిబట్టి వాటిని పెట్టించడాలు ఎరుగుదుం. మంచి యింకా సందర్భం సంఘటించినప్పుడు దాన్ని దాట పెట్టుకోడంలో ఉండే బాధనిబట్టీ, గొప్పవ్యక్తి తనంతట తనే వచ్చినప్పుడు ఖర్చులేకుండా అతణ్ణి అధ్యక్షుణ్ణి చేసుకోడంలో ఉండే సదుపాయాన్ని బట్టీ, ఒక్కొక్క వ్యక్తి తను కార్యకర్తగా ఉండగానే వీలైనంత గొప్పతనంగల సమావేశం జరగాలిగాని కడంచాళ్ళసంవత్సరంలో కాకూడదనే పట్టుదలలనిబట్టీ, సంస్థల ఉత్సవదినాలు ముందుకీ వెనక్కీ జరుగుతూంటాయి. రైల్వే విషయంలో మరీ వీళ్ళున్నాయి. పైచెప్పిన రెండు ఉత్సవాల లోనూ ఏ ఒకటీకూడా లోగడ జరిగి ఉండకపోయినప్పటికీ — వాటిల్లో ఏదో ఓటి, ఏదో దేశంలో ఇక ముందు ఎప్పుడో అప్పుడు ఎవరో కొందరు జరిగించినా బాధ లేదంటున్నారు. ఎందుకంటే, ముందు ఒకగొప్ప ఉత్సవం కానిచ్చేసి తదుపరి వెనక్కి తిరిగి లెఖ్ఖచూసినా, ఆదినం రైల్వే సంస్థకి చెందిన ఒక గొప్పవిషయం ఒక గొప్ప దేశంలో జరిగిన పర్వదినం అయి ఉండి తీరుతుంది. ఇది గాక, అయోమార్గం యావద్భాతలానికీ చెందినదే గనక, భూప్రజలంతా కలసి దాని తాలూకు

వాడుగాని, బెన్లిన్ జులుం చూపారనంటి వాడుగాని నియంత ఒకడు వున్నట్టాయినా, అతణ్ణే అధ్యక్షపదవికి ఆహ్వానిస్తే తీరి పోతుందని సలహా యిస్తున్నారు. కాని అలాంటివాణ్ణి యీభూమిమీదనే అంటగట్టనిస్తే, అతడు తన్నో, తిట్టో, బెదిరించో లాగేసి యీ భూమి మూలనక్కా వెనక తనదే అనడంగాని లేక తనవాళ్ళందరికీ యిక్కడ ఉద్యోగాలకి సిఫార్సు చెయ్యడంగాని మొదలు పెడతాడేమో, అని కొందరు బాధపడుతున్నారు. అంగారక గ్రహంలోంచి కాకుండా మరోగ్రహం దేన్లోంచేనా అధ్యక్షుణ్ణి పిలిస్తే గగనంలో "గర్జన" అనే ఆ మాటేనా సార్థకం చెయ్యాడి నేటి వరకూ ఎవ్వరిచేతా పొందబడకుండా" నిల్చిపోయి ఉన్న వెయ్యి పౌనుల బహుమతికూడా, దఖలుపడుతుంది కదా అని కొందరు అంటున్నారు. ఏమయినా మహాసభా ధ్యక్షుడు - ఆహ్వాన సంఘాధ్యక్షుడు - అన్నట్టు, జగేస్థం న్యగ్గిరాలు ముందుముందు స్థిరపడనున్నా, ప్రస్తుతం తెలుగు దేశపు పవిత్రకావ్య కర్తలకి కాబోయే సభనిమిత్తం జనంచేత యథాశక్తిగా పంపబడ్డ చిత్తు అభినందనతీర్మానాలు కొన్ని తెలిసిరావడంవల్ల, అవిపరీతిగా ఉండగలవో చూడ్డానికి వీలు దొరికింది. అవి ఈక్రింది విధంగా ఉన్నాయి:

నరాలువల శరీరంలో వ్యాపించిఉన్నట్టు, ఇప్పటికే ప్రతీ దేశంలోనూ తెలుగుపట్టులు వ్యాపించి ఉన్నా, ఇప్పటికీ "మొయిలు వెళ్ళి పోయింది గావును, నేను చూడా లనుకున్న

ప్లాటుఫారంగార్ని చూణ్ణేలేదు!", "నల్లటి యెద్దుకి గంటలు కట్టి రైళ్ళు లాగిస్తారు" "ఒకొక్క బూతుబొమ్మకి రెండేసి తలకాయ లుంటాయి!" "మావూరికి సిక్కింటిస్కూలింకా ఎక్కడికో సెప్పమంటాడేటి? నావూ సీడికెంగానన్నాను!", "పడేటికి టికెట్టిమ్మన్నా, ఒకేదగ్గిర దాన్ని నొక్కి టికెట్టుమసిపిస్తాడే!" అని అంటూండే జనంగురించి ఈ సభవారు చాలా దుఃఖిస్తూ వీళ్లు ఒకప్రత్యేక తీర్మానగౌరవం పొందడానికి అనర్హులని నిర్ధరించి, జాలిపడుతున్నారు. —

ఏదో దేశానికి చెంది, కోటీశ్వరులై, ప్రభుత్వబలం యొక్క ఆసరా మూసుగుని స్వాధీన దేశాల్లో ఉండే గ్రామారామక్షేత్రాములు బలత్కారంగా కొని, నాటిని శూన్యస్థలాలుగా చేసి, ఇనపపట్టాల సంకెళ్ళతో ఆస్థలాన్ని కట్టేసి తద్వారా రసయోగం తెలియకుండానే తమ ఇనుముని బంగారంగా మార్చుకో గలిగిన రైల్వేసంఘాల్ని ఈసభవారు కొనియాడుతున్నారు. —

ఒకొక్క వ్యక్తిచేతుల్లో రూపాయిపడిందంటే బొగ్గుగా మారిపోడం మామూలు గనక, జనబాహుళ్యం విడివ్యక్తుల్లో నమ్మకం ఉంచరని గ్రహించి, సంఘాన్ని నమ్మించడానికి సంఘమే ఉండాలని తెలుసుకుని సంఘాలుగా ఏర్పడి, బొగ్గుని రూపాయిలుగా మార్చుకో గలిగిన రైల్వేబుద్ధిసంతుల్ని ఈ సభవారు మెచ్చుగుంటున్నారు. —

పెట్టుబడులకీ ధరలకీ సంబంధం ఏముటో జనానికి తెలియ

రాకుండా అడ్డుపెట్టి, పోటీ తొలగేవరకూ ధరలు తక్కువగా ఉంచి, ఆ తరువాత స్థిరపడిపోయినట్లే ధరలు క్రమక్రమంగా పెంచివేస్తూ, పోటీకోసం సబబుకాని తగ్గింపులు చేస్తూ, లాభాలు పుష్కలంగానే వాళ్లు ఎక్కడుంచారో కనబడకుండా వ్యాపారం చేయిస్తూ ఉన్న ప్రైవేటు ప్రజ్ఞావంతుల్ని ఈసభవారు పొగుడుతున్నారు. —

అయోమార్గాలు మామూలుగా జనోపయోగ నిమిత్తం అని ప్రకటనపత్రం యుద్ధంలాంటి అవసరం వచ్చినప్పుడు స్వలాభం కోసమే అని ఎరుగుండే వ్యవహరించే ప్రైవేట్పెద్దలకి ఈసభ వారు నమస్కరిస్తున్నారు. —

వర్ణాశ్రమ ధర్మాలవంటి తారతమ్యాలు మనుష్యుల్లో కూడదనీ, రక్తాల్లో భేదాలుండవనీ గనకనా, అంతా ఒకటే అనేటంత సర్వసమత్వం తెలిసిన జాతికి చెందినప్పటికీ, అయోమార్గంలో మొదటిక్లాసు, రెండోక్లాసు, మూడోక్లాసు అంటూ తరతమభావం పెట్టిన ప్రైవేటుసంఘాలవారి వివేచనా శక్తికి ఈసభవారు ముక్కుమీద వేలేసుకుంటున్నారు. —

పెద్దబస్తీలలో, ముందుగా ఊరవతల ఒక స్టేషనూ తరవాత నాలిక కరుచుకుని ఊళ్లో ఒక స్టేషనూ వేసి, ఊళ్లో దానివల్ల వచ్చే డబ్బు పట్టుగట్టి ఊరవతలదాన్ని పెంచి, ఊళ్లోదాన్ని వీలైనంత ఇరుకుగానూ అసహ్యంగానూ ఉంచినందుకు, ఈసభ వారు ప్రైవేటుఅధికారుల్ని ఏమనాలో తెలియకుండా ఉన్నారు. -

నాలుగేసి వందలమంది ఒక్కొక్క రైలుకి ఎక్కే స్టేషన్లలో

జనం విశ్రాంతి తీసుకోడానికి నాలుగైదు బెంచీలు సప్లయిచేసి యథాశక్తి ఏర్పాట్లు చేసిన రైల్వే అధికారుల్ని ఈసభవారు శ్లాఘిస్తున్నారు. —

ప్రతీ ప్రయాణీకులబండీ బయలుదేరడానికి రెండుగంటల పూర్వమే టిక్కెట్లకిటికీ తెరిచి ఉంచుతున్నాం అనే రాతతో కిటికీకంటే పెద్దబల్ల కట్టి అక్కడ వేస్తున్నట్లు గంట ఒకటికి నిమిషాలు రెండుమాత్రమే అనే షరా రాయడం మరిచి పోయిన రైల్వే అధికారుల్ని ఈసభవారు వహవ్వా అంటున్నారు. —

రైల్వే ఉద్యోగాలకి జీతాలు తక్కువ అయినప్పటికీ కొన్ని వందల చేతిసొమ్ము అయినాసరే రసంత ఉద్యోగం రైల్వేలో దొరికితే చాలు అనేటంత ఆదాయం ప్రతీ రైల్వే ఉద్యోగస్థుడికీ ఉంటుంది అనేభావం - భ్రమ ! — జనంలో కలిగించిన రైల్వే యజమాన్లకి ఈసభవారు హారతి యిస్తున్నారు. —

క్రింది రైల్వే అల్పోద్యోగిలగాయితు పైనొస్టు ఉద్యోగి వరకూ అధికార్లిచ్చేజీతం తాకీఖుప్రకారం పుచ్చుకుంటూ, అందుకు అదనంగా, జనం — తమపన్లు అర్జెంటుగా లాభకరంగా నెరవేరినందుకు — సంతోషించి యిచ్చే ధన కనక వస్తువాహనాలు తప్ప, తక్కిన మరి ఏయితరమైన లంచాలూ కానుకలూ స్వీకరించకుండా కట్టుదిట్టాలు చేసిన రైల్వే కారకుల్ని, ఈసభవారు ఘనత పరుస్తున్నారు. —

రైల్వే పాలకులు తమపరిపాలనలో, ధనాధికార పైత్యవిశే

అవుతుందేమో, తనకి టిక్కెట్టు అందక తను మిగిలి పోవలిసివస్తుందేమో, పెద్దవాళ్ళే కొనుక్కున్న వాళ్ళు ముందువెళ్లి పోతాడేమో అనేబాధ చొప్పున అనిపగకే అక్కడ నిలబడి ఉన్నవాళ్ళని తొక్కుకుని, వాళ్లమీద తనచుట్ట ఉమ్మి అభి షేకించి తమ 'టముకు' పెట్టి మొనతో వాళ్ళనిగుచ్చి, టిక్కెట్ల కిటికీమీదకి ఎగబడే ప్రయాణీకులు బహుశా తెలుసు తెలిసిన వాళ్లు గనక, వారి అన్యక్ష శౌర్యత్వానికి సంతోషిస్తూ, వారిని నెత్తిమీద పెట్టుకోవాలని చూస్తున్నారు. —

తమయిష్టం వచ్చినచోట తమకు నిలబడి తమ ఎదురు గుండా ఏపెట్టి కనబడితే అందులోకే ఎక్కి, అందులో ఎంత మంది ఉన్నాసరే వాళ్ళని 'తప్పుకో గనక సర్దుకోవాలి' అంటూ, 'ఎంతసేపు - కొంచెం' అంటూ వాళ్ళకి నేవాంతం చేస్తూ చుతూ బాధించుతూ ఉండే జ్ఞానులకి ఈ సభవారు వందనాలు అర్పిస్తున్నారు. —

"టిక్కెట్టు" అంటే రైల్వేకంపెనీవారు అది కొనుక్కున్న వాడి శరీరాన్ని - దైవకృప ఉంటే - దానిమీద రాసివున్న ఊరికి తీసికెళ్ళి వదిలిపెడతాం అని టిక్కెట్టు కొనుక్కున్న వాడితో పడ్డ పూచీమాటలుగల అట్టముక్క అనేసంగతి గమ నించక, టిక్కెట్టు అనేది తాము తమపక్క కూడున్న వాడి మీద చలాయించడానికి ఏదైన అధికారానికి చిహ్నమని భ్రమించి వింతరకపు జంతువులుగా తయారయ్యే ఘనుల్ని చూసి ఈసభవారు హడలిపోతున్నారు. —

చేస్తున్నారు. —

మగసాయం లేకుండా, ఆడవాళ్ళ పెట్టెల్లో కూచోకుండా ప్రయాణంచేసే స్త్రీలున్నపెట్టి చూసుకుని ఎక్కే నాజూకు వేషధారుల్ని వారి పుత్రికా వాత్సల్యానికిన్నీ, సుందరమైన విగ్రహాలుగల స్త్రీలున్నబండే మాత్రమే ఎక్కే లౌక్యాన్ని వారి సౌహార్ద్రశక్తికిన్నీ ఈ సభవారు ప్రస్తుతిస్తున్నారు. —

పబ్బుండీ, రైలుతొందరలో కాఫీహోటళ్లో అడుమం గనుక అట్టగా పోనిలాసరుకు సలువుకొన్నమీద పరాను ల్యాండ్, గబగబా … పడి, వేషంలోనూ జుట్టులోనూ మాత్రమే చేసింగాక్కనూ, చదవడం తెలిసినా నూతనవార్తా ప్రియత్వం ఉన్నా, చూసిచూసి అద్దంపెట్టి స్వంతానికి పత్రిక కొనుక్కోక పక్కవాణ్ణి "మీరు పేపరు చదివారా?" "మీ పేపరు ఓసారి ఇస్తారా?", "మీపత్రికలో ఒకషీటు విడగొట్టి ఇట్లా ఇస్తారా" అని ఎరగనివాడి దగ్గరకూడా యాచించో, పక్కవాడు తన పేపరు తాను చూసుకుంటూంటే అతనిమీద శ్వాస ఆగేటట్లు దగ్గరకొచ్చి తనూ చదువుకుంటూనో, లేక పొరుగువాడు తను కొనుక్కున్న పత్రిక అక్కడ పెట్టి ఏ స్నేహితుడితో టౌను కబుర్లు చెప్పుకోవడంలో ఉండగా వాణ్ణి అడక్కుండా తీసుకునో, ఇట్లా చెయ్యడంలో తనయొక్క గడుసుదనానికి లోపల తనే ఆనందిస్తుంటూ, పులిస్తరాకులమీద జంతువులు ఎగబడ్డట్లు, పరాయివాడి పత్రికమీద విరుచుకుపడి, తను దిగేవరకూ ఆ ఎంగిలిపత్రిక ఇదిగో అని యజమానుడికేనా

చేస్తున్నారు. —

సహాయం లేకుండా, ఆడవాళ్ళ పెట్టెలో కూచోకుండా ప్రయాణంచేసే స్త్రీలున్న పెట్టి చూసుకుని ఎక్కే నాజూకు వేషధారుల్ని వారి పుత్రికా వాత్సల్యానికిన్నీ, సుందరమైన పరిగెత్తే స్త్రీలున్న బండీ మాత్రమే ఎక్కే లౌక్యుల్ని వారి మాతృభక్తికిన్నీ ఈ సభవారు ప్రస్తుతిస్తున్నారు. —

డబ్బుండీ, రైలుతో కొందరలో కాఫీహోటల్లో అడుదుం బడుసుం అంటూ పానలాసరుకు నిలువు కాళ్ళమీద పరామ ర్శించి, గబాగబా పెట్లో పడి, వేషంలోనూ జుట్టులోనూ సొగసుకనే పెద్దలగకొక్కరూ, చదవడం తెలిసినా నూతనవార్తా ప్రియత్వం ఉన్నా, చూసిచూసి అర్ధణా పెట్టి స్వంతానికి పత్రిక కొనుక్కోక పక్కవాణ్ణి "మీరు పేపరు చదివారా?" "మీ పేపరు ఓసారి ఇస్తారా?", "మీపత్రికలో ఒకషీటు విడగొట్టి ఇల్లా ఇస్తురూ" అని ఎరగనివాడి దగ్గరకూడా యాచింపో, పక్కవాడు తనపేపరు తను చూసుకుంటూంటే అతడిమీద శ్వాస లోపల వదులుతూ దగ్గరకొచ్చి తనూ చదువుకుంటూనో, లేక ఎరగనివాడు తను కొనుక్కున్న పత్రిక అక్కడ పెట్టి ఏ స్నేహితుడితోటో కబుర్లు చెప్పగోడంలో ఉండగా వాణ్ణి అడక్కుండా తీసేసుకునో, ఇల్లా చెయ్యడంలో తనయొక్క గడుసు దనానికి లోపల తనే ఆనందించుకుంటూ, పులిస్తరాకులమీద జంతువులు ఎగబడ్డట్టు, పరాయివాడి పత్రికమీద విరుచుకుపడి, తను దిగేపటికూ ఆ ఎంగిలిపత్రిక ఇదిగో అని యజమానుడికేనా

యివ్వకుండా, చదువుతూండే ధనికులయొక్క ధనత్వం, ధన్యత్వం, సరసత్వం గురించి ఈసభవారు బెంగెట్టుకునిపోయి హోరున, ఆనందిస్తున్నారు. —

గంటలకి గంటలు ప్రయాణం ఉన్నా, ఏమీ చెయ్యకుండా కిటికీకి దగ్గిర స్థలం సంపాదించుకుని, తమ తాలూకు మూటలు పైన పెట్టుకుని, బయటికి చూస్తూ కిమ్మనకుండా గడిపే ఆలోచనపరుల్ని ఈసభవారు మెచ్చుకుంటున్నారు. —

మూటుకేసులు, పరుపులు, పీటలు వగైరాలు కిటికీల్లోంచి లోపలికి గిరవాటేసి రైలు ఇక వదలబోతోందీ అన్నప్పుడు ఎక్కి, అదివరకే కర్మవశంచేత లోపల కూచున్న పిరికి జనంమందికి ముడుసులు విరగ్గొట్టేవాళ్ళ అహింసాభావానికీన్నీ, వేగానికీన్నీ ఈసభవారు వారిని మర్యాద చేస్తున్నారు. —

నిద్దర, జబ్బు, నోరు, జబర్దస్తీ, బిచాణావగైరాలు ఉపయోగించి నియమితస్థలం తమరు ఆక్రమించుకుని, అదే తమ ఆధిక్యత అని గర్వించే మహాత్ములని ఈసభవారు ఆరాధిస్తున్నారు. —

పరాయివాడిచేత కిరాయి పెట్టించిగాని, బల్ల కింద దూరిగాని, పాకీదొడ్లో నక్కిగాని, సమయానికి అవతల చేపుననుదిగిగాని, ఇతరత్రా దగాచేసిగాని, సన్యాసులైగాని, కాపలసినవారైగాని, సేవకులైగాని, నెత్తిమీద నామాలుగాని, తత్సంబంధం కలవారైగాని, ఎల్లాగో అల్లాగ టికెట్టు స్వంతంగా కొనకుండా ఉచితప్రయాణంచేసే అదృష్టవంతుల్ని

ఈసభవారు బ్రహ్మరథం పడుతున్నారు. —

అతిజవంతో రైలు పోతూన్నప్పుడు అందులో కూచుని బయటికి చూస్తే దగ్గరవని మనం అనుకునే వస్తువులు మన్ని విడిచిపెట్టి దూరంకావడమున్నూ, దూరానివే మన కూడా రావడమున్నూ ప్రతి నిత్యమూ గమనిస్తూండీ కూడా, తాపత్రయపడే మహామహుల్ని ఈసభవారు ఊరేగించి గౌరవిస్తున్నారు. —

తను ఎంతో వేగంతో పోతున్నా ననుకుంటూ, రాత్రిప్పుడు, నక్షత్రాలకేసి చూస్తే తనూ, తనవాహనం, తన లోకం - వీటి ఉనికీ ఛూమంటమూ మాకేం తెలుసును అన్నట్టు ఆ నక్షత్రాలు నిర్నిమిత్తంగా ప్రకాశిస్తూఉండడం గమనించి మానవుణ్ణి అల్పుడుగా కట్టేవార్ని ఈ సభవారు నిరసిస్తున్నారు. —

శాంతంగా ఆలోచిస్తే రైలుప్రయాణం అనేది చిన్న ప్రమాణంలో జీవితప్రయాణం లాంటిదే అనిన్నీ, మానవ స్వభావాలు బయటపెట్టడానికీ మానవుణ్ని తయారు చెయ్యడానికీ, అది చాలుననిన్నీ అనేవారిభావం శుద్ధపేలవం అయినప్పటికీ వారు అట్లాంటివి ప్రకటింప సాహసించి నందుకు ఈసభవారు వారిమీద కొంచెం కోపం దాల్చడానికి ముహూర్తం వెతుకుతున్నారు. —

# తిండి విశేషాలు

[12 - 11 - 1939 తేదీని రాజమండ్రీచుట్టుపట్ల ఒక వనంలో సంతర్పణ జరిగింది. ఆ తేదీనే చాలా జరిగేయుంటాయి గాని, వాటిల్లో ఇది ఒకటి. అందునిమిత్తం గ్రామాంతరాల్నించి నాస్తికులైన ఆంధ్రఉద్యోగులు విరివిగా రావడానికి ఏర్పాట్లు కావడం, అట్లానే చాలామంది రావడం కూడా జరిగింది. దీన్లో అదనం ఏమిటంటే, సంతర్పణానంతరం — పోనీ, సంతర్పణకి తప్పనిసరి ఫలితంగా ఉండే క్షుద్రనిద్రానంతరం, అసగా మూడు గంటలికి ప్రారంభించి — ఒక మాటలప్రదర్శనంకూడా జరుగుతుందని కరపత్రాలు అచ్చుపడ్డాయి. అధ్యక్షులు ఫలానా, వక్తలు ఫలనాఅంటూ కార్యక్రమం వాటిల్లో ఉంది. లోగడే కార్యదర్శిగారు నన్ను గౌరవించి ఆసందర్భంలో నన్ను ఒక వక్తగా ఉండకోరారు. నేను ఆయనికి విధాయకుణ్ణి అవడంచేత "కాదు" అననూ లేక, అయినా వెంటనే ఒప్పుగోనూ ఒప్పుకోక, "ఎంత చదువుకున్నవాళ్లయినా ఎంత 'అర్థం' చేసుకోగలవాళ్లయినా, ఉదాత్తంగా భోజనంచేసిన తక్షణం ఏ ఫలారంఅంటిదో పుచ్చుకోగల్రుగాని, ఉపన్యాసాల వంటివి బొత్తిగా స్వీకరించలేరేమో, ఆరకం పదార్థాలు ఆసమయంలో విషమించవచ్చునుమండీ!" అంటూ నసగడం మొదలెట్టినా, ఆయన తన ఉత్సాహంలో "వల్లకాదు, మీరు ఒప్పుగునితీరాలి!" అని, నాచేత "సరే లెండి" అనిపించి, వక్తల జాబితాలో నన్నుకూడా అచ్చుకొట్టేశారు.

అక్కర్ణించి, నేనూ కొంచెం ఉగ్రనులిపి, పెల్చడానికి వీలైన సామగ్రి కొంత సిద్ధం చెయ్యవలసొచ్చింది. ఒకో విషయం మరో విషయం అయితే అప్పట్లో మరీ వికటించి పోతుందేమో అని భయం పట్టుకోవడంవల్ల, జనం అందరూ అంతకి పూర్వమే ఆచరించవల్ల గ్రహించిఉంటారుగనక భోజనప్రమేయమే ఎత్తుగుని కొన్ని సంగతులు వర్ణించుదాం అనిన్నీ, ఏఘట్టంలో సదాగ్రం మిక్కుటం అయిపోయి వెళ్లిపోవేలా కనిపిస్తుందో అక్కడినో రక్కున ఆగిపోయి జీవక్షోభ కలగకుండా జాగ్రత్త పడదాం అనిన్నీ ఆయత్తం చేసుకున్నాను. అయితేం! మనసుకి సమా! సంతర్పణ అయింది, రిమార్కులు అయినాయి, నిక్కచ్చిగా దంతవృద్ధని చేసినవాళ్ల ఆపసోపాలు అయినాయి, ఇటూ అటూ దొర్లుతూ కునుకులాగడాలు అయినాయి, కొంచెం గానాబజానా అయింది, ఏల్లానో తంటాలు పడి, దాని మొహం చూడ్డొ, సాయంత్రం అయిదుగంటలు కూడా అయింది. తక్షణం కొందరు బ్యాంకుఉద్యోగులు, “కొంపతప్పి కరపత్రాల్లో నిరూపించి ఉన్న ప్రకారం, ఆలస్యం అయితే అయింది, మీటింగూ దానితాలూకు ఉపన్యాసాలూ కూడా ఎక్కడ తప్పిపోగొడదా, ఇవన్నీ భరించడం ఎల్లాగా భగవంతుడా!” అని బెంగపెట్టుకున్నట్టు బిక్క మొహాలు వేశారు. దానికి సభ నిర్వహిస్తున్నవాళ్ళలో ఒకాయన, “మరి ఆలస్యం చెయ్యాని మీటింగు కానిస్తాం, బల్లలు సర్దండి” అనే సంగతి చెప్పడం నిష్కర్షగా మంచినీళ్ల ప్రవాహంగా

ఆంధ్రంలో అనేశాడు. "సభంతాసనీ జరిగిపోయిం దన్నమా ఓరా దేవుడా" అని కొందరు ఉద్యోగులు నిస్పృహాలో పడిపోయారు. ఏనాడు చేసుగున్నదో మరి అనుభవించాలి గావును అనుకోడంవల్ల గావును, కొందరికి మొఖాన్ని కత్తి వాటువేస్తే నెత్తురులేదు. కాని కొందరు గడసర్లు ధైర్యం అవలంబించారు. "అన్నట్టు, ఫోటో తీయించుగో వాలి గావునుగా! అదిచాలా ముఖ్యం. వెలుగుండగానే ఇల్లుచక్కబెట్టుగో మన్నాడు. ఫోటో చిక్కబెట్టుగోమన్నాడు. ముందు ఫోటోయే! తరవాత తతిమ్మాలి" అని మాట్లాడుతూనే, వాళ్లు, బల్లలూ, కుర్చీలూ అవీ ఉన్నచోటిన్నుంచి ఓ ఫర్లాంగు దూరం ఈడ్చేశారు. సూర్యాస్తమయంవరకూ వాళ్లు నిమ్మనిమ్మళంగా ఫోటోగ్రాపు దిగుతూనే ఉండిపోయారు. మాట్టుకి ఒక్కడూ వక్తలున్నవైపైనా రాలేదు. కార్యదర్శిగారు చాలా నొచ్చుగుని, వక్తల్ని క్షమాపణ కోరుకున్నారు. వానప్రస్థంరోజునే ఉపన్యాససన్యాసం కూడా సిద్ధించి శ్రమలేకుండా రెండాశ్రమాలు లభించడం జన్మకి చాలుగదా అని వక్తలన్నారు. కార్యదర్శి ఆ ఫోటోగ్రాపు చెట్టువగ్గిరికి మళ్లీ వెళ్లి చూసొచ్చి, కొందరు కుర్చీలకి అంటిల్లా అయిపోయారనిన్నీ, కొందరు మౌనవ్రతంలో పడ్డట్టు చెప్పారనిన్నీ, తక్కినవాళ్లు పంచభంగాళం అయిపోయారనిన్నీ చెప్పారు. "అయ్యా! ఇప్పుడొచ్చిన ప్రమాదంవమీ లేదు. ఉపన్యాసన్యాసాలకే, అర్థం చేసుకోగలవాళ్లు కూడా వాడిలిపోవడం

నేనూ పడ్డాను. కాని, ఆరోజున ఇతరవిషయాల్లో చాలా ముఖ్యమైనవి ఉండడంచేత, నాకు ఇచ్చిన వ్యవధి చాలక, నాకు కొంచెం — అనగా చాలా — ఉక్కిరిబిక్కిరి అయింది. ఏదేనా సమగ్రంగా చెప్పడానికీ వీలులేకుండా, పోనీ మానడానికీ వీలులేకుండా వచ్చింది. నేను సరాసరా ఉపోద్ఘాతం కానిచ్చుగుని, "అబద్ధం ఆడడం" గురించి ఒక పరిచ్ఛేదం చదివి, విషయం మారుస్తున్నా నని చెప్పి, ఈక్రిందరచనలో తిండిపోటీలున్న ఘట్టంలో కొంతమాత్రం తిరగేశాను. ఆవాక్యాలలో పేర్లూ, స్థలాలూ, అంకెలూ, లెఖ్ఖలూ, తేదీలూ ఉంటూండడంచేత వాటి యాథార్థ్యం నేను నమ్మే చదివాను. కాని, వాటిల్లో, చెప్పులుతినడపు పందెంసంగతి నేను చదువుతూన్న క్షణంలో, చీమ కేనా సందులేకుండా ఉన్న ఆ మహాసభలోంచి ఒక పురుషుడు ( — శ్రీ శ్రీ సర్ కె. వి. రెడ్డినాయుడుగారు అధ్యక్షత వహించిన అంత సభలో ఉన్న అంతమందినీ నేను అసత్యాలు చెప్పి మోసగిస్తూన్న సంగతి తను ఒఖ్ఖడే హఠాత్తుగా పరిశోధించినట్టు — నేను అబద్ధం ఆడడం గురించి అంతకిపూర్వమే ముచ్చటించిఉన్న వాణ్ణవడంచేత ఆతరవాత నేను ప్రసంగించేది ప్రతీదీ మంచి అబద్ధం అయి ఉండకపోతుందా అనే అఖండానుమానం తన్ని పీడించుతూన్నట్టు — ) లోకకల్యాణం నిమిత్తం నావాక్యం కేవలం కోత అని ఋజువుచెయ్యడానికిట, "కోయ్ కోయ్" అనే శంకారావం చేసి, తను రెండు కోతలు కోశాడు.

నాని ఆత్మస్తుతిగల వాక్యాలైఉంటే నాటిని రెండు కాను మూనుకోతల దుర్వ్యాస్నలాగ కొయ్యొచ్చు. కాని, స్థితివేరు! వారు అవస్థావశంచేత గౌతమీస్నానం నిమిత్తం రాజమండ్రీ వెంచేసిన తైర్థికులై ఉండవచ్చునని నా రాజమండ్రీత్వానికి తోచి, నేను అర్థాని వచ్చినవేపు తిరిగి, "అయ్యా! నావాక్యాలకి లిఖితమైన సమ్మతగ్గ ప్రమాణం నాదగ్గిర ఉందండి! ప్రస్తుతం క్షమించండి" అనేసి, అప్పట్లో వ్యవధిలేని స్థితిలో ఉండడంవల్ల ఊరుకున్నాను. కాని, ఇప్పుడేనా సప్రమాణంగా ఉంటే ఆనాటి మహాసభకి హాజరైఉండి ఆవేళ కమామీషు జ్ఞాపకంఉండి, ఈ రచనచూడ తటస్థించే రాజమండ్రీవాళ్ళైనా నన్నుశంకించకుండా ఉంటారుగదా అనే ధైర్యంతోప్పాన అటువంటి వాక్యాలచివర జగత్ప్రసిద్ధిగల ఒకానొక వారపత్రిక యొక్క సంచికనెంబరూ, మరి దానితరవాత ఆ సంచికలో ఆయా పోటీసంగతి అచ్చుపడ్డ పేజీ సంఖ్యా ఇచ్చాను. అన్నివేల సంచికలు కోతలతో భూమిమీద చెలరేగడం కష్టం. అయినా సరే, ఆపత్రికమాత్రం కొండమీంచి ఊడిపడిందా అంటే, మరి నమస్కారం!! పేర్లూ, అంకెలూ, లెఖ్ఖలూ ఉన్నాయిగా! హృదయం, బుర్రా, ఓపికా, పట్టుదలా ఉంటే బుజువుచేసి నూనుగోడానికి పిలుస్న్న సంగతు[redacted]కూడా చెవికి ఇల్లాం తగిలాడో లేదో ఆపళంగా కొయ్‌కొయ్[redacted]మని గర్జించి తెయ్ తెయ్ మని ఆడేసేకంటె, తణిఖీచేసి య[redacted]ర్థం తేల్చుకునేదాకా నేనా ఆగడం ధర్మం. విద్యావంతుడు[redacted]వినగానే తను

నేనూ పడ్డాను. కాని, ఆరోజున ఇతరవిషయాల్లో చాలా ముఖ్యమైనవి ఉండడంచేత, నాకు ఇచ్చిన వ్యవధి చాలక, నాకు కొంచెం — అనగా చాలా — ఉక్కిరిబిక్కిరి అయింది. ఏదేనా సమగ్రంగా చెప్పడానికీ వీలులేకుండా, పోనీ మానడానికీ వీలులేకుండా వచ్చింది. నేను సరాసరా ఉపోద్ఘాతం కానిచ్చుకుని, "అబద్ధం ఆడడం" గురించి ఒక పరిచ్ఛేదం చదివి, విషయం మారుస్తున్నా నని చెప్పి, ఈక్రిందరచనలో తిండిపోటీలున్న ఘట్టంలో కొంతమాత్రం తిరగేశాను. ఆవాక్యాలలో పేర్లూ, స్థలాలూ, అంకెలూ, లెఖ్ఖలూ, తేదీలూ ఉంటూండడంచేత వాటి యాథార్థ్యం నేను నమ్మే చదివాను. కాని, వాటిల్లో, చెప్పాలుతినడపు పందెంసంగతి నేను చదువుతూన్నక్షణంలో, చీమకేనా సందులేకుండా ఉన్న ఆ మహాసభలోంచి ఒక పురుషుడు ( — శ్రీ శ్రీ సర్ కె. వి. రెడ్డినాయుడుగారు అధ్యక్షత వహించిన అంత సభలో ఉన్న అంత మందినీ నేను అసత్యాలు చెప్పి మోసగిస్తూన్నసంగతి తను ఒఖ్ఖడే హఠాత్తుగా పరిశోధించినట్టు — నేను అబద్ధం ఆడడం గురించి అంతకిపూర్వమే ముచ్చటించిఉన్న వాణ్ణవడంచేత ఆతరవాత నేను ప్రసంగించేది ప్రతీదీ మంచి అబద్ధం అయి ఉండకపోతుందా అనే అఖండానుమానం తన్ని పీడించుతూన్నట్టు — ) లోకకల్యాణం నిమిత్తం నావాక్యం కేవలం కోత అని ఋజువుచెయ్యడానికిట, "కొంయ్ కొంయ్" అనే శంకారావం చేసి, తను రెండు కోతలు కోశాడు.

నాని ఆత్మస్తుతిగల వాక్యాలైఉంటే వాటిని రెండు కాదు మూడుకోతల దువ్వెన్నలాగ కొయ్యొచ్చు. కాని, స్థితివేరు! వారు అవస్థావశంచేత గాతమిాస్నానం నిమిత్తం రాజమండ్రీ వేంచేసిన తైర్థికులై ఉండవచ్చునని నా రాజమండ్రీత్వానికి తోచి, నేను అర్థ్వాని వచ్చినవేపు తిరిగి, "అయ్యా! నావాక్యాలకి లిఖితమైన సమ్మతగ్గ ప్రమాణం నాదగ్గిర ఉందండి! ప్రస్తుతం క్షమించండి" అనేసి, అప్పట్లో వ్యవధిలేని స్థితిలో ఉండడంవల్ల ఊరుకున్నాను. కాని, ఇప్పుడేనా సప్రమాణంగా ఉంటే ఆనాటి మహాసభకి హాజరైఉండి ఆవేళ కమామిాషు జ్ఞాపకంఉండి, ఈ రచనచూడ తటస్థించే రాజమండ్రీవాళ్ళైనా నన్ను శంకించకుండా ఉంటారుగదా అనే ధైర్యంచొప్పున అటువంటి వాక్యాలచివర జగత్ప్రసిద్ధిగల ఒకానొక వారపత్రిక యొక్క సంచిక నెంబరూ, మరి దానితరవాత ఆ సంచికలో ఆయా పోటీసంగతి అచ్చుపడ్డ పేజీ సంఖ్యా ఇచ్చాను. అన్ని వేల సంచికలు కోతలతో భూమిమిాద చెలరేగడం కష్టం. అయినా సరే, ఆపత్రికమాత్రం కొండమిాంచి ఊడిపడిందా అంటే, మరి నమస్కారం!! పేర్లూ, అంకెలూ, లెఖ్ఖలూ ఉన్నాయిగా! హృదయం, బుర్రా, ఓపికా, పట్టుదలా ఉంటే ఋజువుచేసి చూసుగోడానికి వీలున్న సంగతులుకూడా చెవికి ఇల్లా తగిలాయోలేదో ఆపళంగా కొయ్‌కొయ్ మని గర్జించి తైఘ్ తైఘ్ మని ఆడేసేకంటె, తణిఖీచేసి యథార్థం తేల్చుగునేదాకానేనా ఆగడం ధర్మం. విద్యావంతుడు వినగానే తను

విన్నది ప్రతిదీ నమ్మసెయ్యగూడదనిమాట నిజమే. కాని, క్షణానికి ఒకటిచొప్పున మహాద్భుతాలు అని వెనక అనుకుంటూండబడేవి సుసాధ్యాలూ, సాధారణాలూ అయిపోతూన్న ఈ యుగంలో చెవినిపడ్డ ప్రతీసంగతీ, ఒకవేళ దాఖలాఅయే బాపతేమో అనికూడా ఆగకుండా, బేసమయం అయినాసరే, మూకలో నక్కడానికి వీలున్నంతమాత్రాన్ని, ఇతరుల ఖర్చుమీద శ్రమలేకుండా నుంచున్నపాట్న నీచపుకీర్తి పబ్లికుగా నొల్లుకుని ఖాయంగా ఉంచేసుగోవాలనే కక్కుర్తి తొందరలో 'అబద్ధం, అయథార్థం' అని కేకలెట్టి, తద్వారా రసాభాసం కల్పించి, ఆక్షణంలో విజయం తందే అనుకుని గర్వంకూడా వహించి, తనకంటె చిన్నసైజు మైరావణులైన లోకువస్నేహితుల దగ్గిర అపవిత్ర స్థలాల్లో పచ్చిడచ్చీలు కొట్టుగోడం విద్యాధికుడియొక్క లక్షణంలా కనిపించదు, – అందులో నుఖ్ఖీ ఇంగ్లీషు విద్యాధికుడియొక్క లక్షణంలా అసలు కనిపించదు. అయినా చెప్పలేం! స్వాతంత్ర్యపురోజులు! "మరి ప్రకృతం—"]

భోజన సందర్భాల్లో ప్రసంగాలు మనలో వాళ్లీ ఉన్నట్టు తోచదు. భోజనకాలంలో గోవిందనామ స్మరణతోనే ఆర్యులు — అనార్యులూ అంతే అయిఉండదు — తృప్తిపొందుతారుగాని, ఐహికస్మరణ చెయ్యరు. దేవుణ్ణి తల్చుకునేటప్పుడు జోరుగా సమూహంగా అరవడంవల్ల కూడా గొంతికి సాక్షీపడి భుజించడానికి ఎక్కువ అనువుపడుతుందని కొందరిఊహ. అయినా ఈ (మిథ్యా) వనభోజనసందర్భంలో ఏదైనా మామూలు ప్రసంగం

చెయ్యవలసిందని నిర్వాహకులు నన్ను కోరడంవల్ల భయపడు తూనే నేను అంగీకరించడమైంది. సభ్యుల్లో పరిచితులు విశేషంగా లేనప్పుడు చనువుగా మాట్లాడ్డానికి కొంచెం బెదురుగా ఉంటుంది. కాని, మానవ వ్యక్తుల స్వభావనిర్ణయంతో జోక్యంలేని మాటలుకొన్ని చెబుతున్నాను గనక అపరిచితులైనా ఏమీ మరోలాగ ఎంచవద్దని ప్రార్థన.

ప్రాణరక్షణకోసం తినేది తిండిఅంటారు. అందుకోసమే కాకుండా విలాసంకోసం కూడా భుజించే సందర్భాన్నీ, అవకాశాన్నీ, పదార్థాల్నీ భోజనం అంటారు. ఏదేనా సందర్భంలో, భోక్తా పదార్థమూ ఉంటేగాని భోజనముండదు. సందర్భంఅంటే: తిండితినడం, అయిందనిపించడం, ఎంగిలి పడడం, మూతితుడుచుగోడం, మెతుకు కొరకడం, మంచిమాట చేసుగోడం, ఫలాయితు తీర్చుకోడం, పథ్యంతినడం, పోగు చెల్లించడం, విందారగించడం, మనుగుడుపులు, దేవతార్చన, సాపాటు, పార్వణం, అశనం, పిండం — ఇల్లాగ్గా మిక్కిలి ఉన్నాయి. భోక్తల్లో రకాలు చెప్పడానికే ఇదిసమయంకాదు. ఏమంటే, వాళ్లమనస్సులూ, ఆశ్రమాలూ, స్వభావాలూ, స్థితులూ, పరిస్థితులూ, అవస్థలూ — ఈ రీతిగా బోలెడు చూడాలి. కాని, ప్రతీభోక్తకీ ఒకశరీరం ఉండితీరాలి. స్థూలంగా చెప్పాలంటే, 200 ఎముకలూ, 500 కండరాలూ, రోజుకి లక్షసార్లుకొట్టుకొనే గుండె, చదరపు అంగుళానికి 3000 రంధ్రాలుగల చర్మమూ మొదలైనవి ఉండి తీరతాయి. ఇల్లాంటి

శరీరంయొక్క రక్షణకై సగటున రోజు 1.కి అయిదున్నర పౌన్ల ఆహారం - అనగా దామాషాయీని సంవత్సరానికి ఒకటన్ను బరువు తినుబండ (తాగుబండాలు మానవుడు లోపలికి పుచ్చుగో వలసి ఉంటుంది అని శాస్త్రజ్ఞులు లెక్క వేశారు. (నెం. 2972 పే. 5.)

ఆహారపదార్థం ఏదికావచ్చును అనేది ప్రశ్న. దీనికి సమాధానం చాలావిశాలం. ప్రాణంగాని ప్రాణాన్ని పోషించలేదు. అందుకని పెద్దప్రాణం చిన్నప్రాణాన్ని మింగేసి నప్పుడుగాని నిలబడదు. అందుచేత మానవుడు ఇతరప్రాణుల్ని తినేస్తాడు. మనుష్యుల్ని తినేసే మనుష్యులు ఇప్పుడుకూడా అక్కడక్కడ —పోనీ ఎక్కడో అక్కడ - ఉంటారని కొందరు చెబుతారు. ఉండవచ్చును! మనలో ఒకొక్కడికి ఇంకోడిమీద తీవ్రకోపం వచ్చినప్పుడు వాణ్ణి తినేసేటట్టు చూస్తాడు, గాని తినేసెయ్యడు. సాధారణంగా మానవుడు జంతువుల్ని పుచ్చుగుంటాడు. తననే తినేస్తాయేమో అనేభయముండున్న క్రూరజంతువుల్ని మానవుడు వదిలేస్తాడు. కడంవాటినే కానిస్తాడు. అటువంటివి తిన్నకొద్దీ పుడుతూంటాయి, పుట్టినకొద్దీ తినబడుతూంటాయి. పళ్ళగట్టీ, నాలికవాడీ, ముక్కుడళసరీ గల మానవులు పచ్చి జంతువుల్నే కొరుక్కొని తినేస్తారు. కాని, నాజూకుమనుష్యులు తమ నేర్పువల్ల కొన్నిభాగాలు స్వీకరించి, కొన్నింటిని విసర్జించి, ఇతర ఘనద్రవ పదార్థాలతో కలిపి, అగ్నిమిత్రసాహాయ్యం పొంది, కొత్తసమాసాలు సృష్టించుగుని పుచ్చుగుంటారు; అల్లానే గాల్లో పక్షుల్నీ, నీళ్లలో చేపల్నీ స్వీకరిస్తారు. ఆపైని

మానవులు వృక్షాల్ని మూలం లగాయితు చిగురు వరకూ తమ ప్రజ్ఞవల్ల చేర్చి నూతనమిశ్రణాలు కల్పించుకుని తింటారు. మూలానికి నాశనం రానీకుండా చెట్లు ఇచ్చే ఫలంగాని, జంతువులిచ్చే రసంగాని పుచ్చుకోడం కొందరి మతం, చెట్టు యొక్క ఫలం కోసుకునేటప్పుడు కూడా దాని ప్రాణానికి హాని కలుగుతుంది గనక, చెట్టునుంచి వాటంతట అవే రాలిపోయిన ఫలాలే తినాలని కొందరి బాధ. వానకి మొల్చి గాలికి పెరిగే నీవారం తినాలని కొందరి తంటాలు. దూడ వెళ్ళి ఆవుదగ్గిర పాలు తాగేటప్పుడు రేగే నురగ రేణువులు దూరాన్ని ఉండి ఆరగించాడు ఒకాయన అన్నారు. పరిశుభ్రమైన జలం తాగి వాయువు పీల్చి జనం జీవించాలి అంటారు కొందరు. వీళ్ళంద రికీ ఉద్దేశం ఏమిటంటే, ప్రాణం నిలిపే మూలకణాలు గల పదార్థాలు కొన్ని ప్రాణం తీసేసే కణాలు గలవి కొన్ని ఉన్నాయనిన్నీ, ప్రాణం నిలిపేవే పుచ్చుకోవాలనిన్నీ, అవయినా మోతాదు చూసుకుని, వేళపట్టున, తత్వాన్ని బట్టి, కాలానుగుణ్యంగా, అందుబాటు ఆలోచించి, మొహమాట పడుతూ పుచ్చుకోవలసి వుంటుంది అనిన్నీ.

కాని, ప్రపంచంలో జరుగుతూండే తిండిపోటీలు గమనిస్తే చాలా ఆశ్చర్యంవేసి, ప్రాణాపాయం అయినవస్తువులు అసలే లేవా అనిపిస్తుంది; తిండికి హద్దులేదా అనిపిస్తుంది. చూడండి: స్టాట్‌ఫోర్డులో జె. కొంబార్ అనే అతడు నాలుగు పౌన్లబరువు గలచేపల్ని ఒకగంటలో తినలేడు - అని ఒకడు పందెం వేశాట్ట.

అయితే, అతడు అన్ని చేపలూ 20 నిమిషాల్లో తినేసి ఊరు కోక పైపెచ్చు ఏడుపైంట్ల 'బీరు' పీల్చేసి పందెంనెగ్గి రాయల్లా ఉన్నాడు [2880-4]. లాస్ యాంజెలిస్‌లో కోడిపెట్టలు తినడం పోటీ జరుగుతూంటుందిట. 1936-వ సంవత్సరపు పోటీలో మూడేసి పౌన్ల బరువుగల 10 కోడిపెట్టల్ని — 15 పౌన్ల బరువు మసాలాతో సహా — తినేసి ఎడ్నా పాటర్ అనే అదృష్టవంతురాలు నెగ్గిందట [2887-12]. పెద్దరకం అరిటిపళ్ళు తినడం పోటీలో ఆల్బర్టా నగరానికి చెందిన మెక్‌గీ అనే దొర ఒకటి మాత్రమే ఎక్కువగా మెక్కి పందెం నెగ్గాడుట. అవతలపోటీదారు 42 మాత్రమే పుచ్చుకో గలిగాడట, ఇతడు 43 ఊదేశాడు [2911-5]. ఏడేసి అంగుళాల వెడల్పు గల పెద్దపెద్ద బిందిరొట్టెలు 36 మాత్రం 61 నిమిషాల్లో నమిలేసి ఒక అమెరికా దేశస్థుడు యునైటెడ్ స్టేట్సులో రొట్టెల మహా సమ్రాట్ అనేబిరుదం పుచ్చుకున్నాడట [2894-4]. యూగో స్లావియాలో ఒకముష్టివాడు పచ్చికప్పల్ని, చేపల్ని, ఎలకల్ని, పాముల్ని జనంఎదట భక్షించి యాచనవల్ల జీవయాత్ర చేసేవాడున్నాడు [2917-4]. టర్కీలో ఇజమీర్ గ్రీలో ఒక రయితు మామూలు కూర తరిగినట్టు తన రెండు చెప్పులూ తరిగి, ఇంతవెన్న ఆ చెప్పుముక్కలికి పామి ఒక్కఅరగంట వాటిని పెనంమీద వేయించి, దింపి, లగాయించేసి పందెంనెగ్గి బహుమతీ నవరసు విలువా పుచ్చుకున్నాడట [2968-3]. నోవాస్కోషియాలో ఒకబాలుడు ఒకకత్తి రేకూ, ఒక ఎలె

ట్రిక్ బల్బూ తినేశాడట. ఇంకొక మనిషి ఇనపతీగెలూ, తీగచుట్టలూ తినేస్తున్నాడు అని తెలిసి, వాణ్ణి తీసికెళ్లి గ్లాస్గో కారాగృహంలో పెట్టగా, వాడికి బుద్ధిరాక, వాడు ఇనప గడియలూ, ఊచలూకూడా తినెయ్యడం మొదలెట్టాడట. డార్జిలింగ్‌లో యోగుల స్నేహంసంపాదించిన ఒక ఐరిష్‌వాడు ఒకేసారి 150 మేకులూ, 700 గ్రామఫోన్ సూదులూ తినే శాడట, చావలేదు. వీరందర్నీ మించినవాడు ఒక జర్మన్ సామంతుడు. ఆయన 150 మేకులూ, 102 ఇత్తడి సూదులూ 150 గాజుముక్కలూ, 7 గుఱ్ఱపులాడపు మేకులూ. 6 నాణెపు కాసులూ, 3 కత్తెపుముక్కలూ, సీసపుముద్దా, 20 ఇతర నానూనులూతినేసి చావడంలేదు దిబ్బా లేదు, 'బోయిలర్' లాగ అల్లానే ఉన్నాడట [2944-6]. విషద్రావకాలు తాగి చావకుండా నిల్చినవార్ని ఎరుగుదుం. విషం పెట్టగా తెలి యక తినేసి చావకుండా నిల్చిన శాండో రామమూర్తిని ఎరు గుదుం. మనదేశంలో పోటీలు, ప్రాణాపాయం కావు అని అందరూ ఎరుగున్న పదార్థాలతోటే గనక విస్తారం అవసరం లేదు. అవసరమైన పాదరసంతో ఆహారం కల్పించుగుని, అది బుగ్గనో కంఠంలోనో ధరించి, మరి వళ్ళతరబడి ఆకలి దప్పులుగాని విసర్జనగాని లేకుండా విహరించగల మనుష్యులు హిమాలయపు గుహల్లో ఉన్నట్టు స్నేహితులు చెబుతారు.

దేనినల్లా ప్రాణాపాయం రాకపోవచ్చునని పైవాట్లవల్ల తెలుస్తూంటే, ప్రాణరక్షణకి ఏదైనా చాలని చెప్పడానికి

కొన్ని నిదర్శనా లున్నాయి. మేబిల్ యాష్వర్త్ అనే ఆమె 11 ఏళ్ళనించి పాలుమాత్రం తాగి ఉంటోందిట. పంచదార మట్టుకు జాస్తిగా వేసిన 'టీ' మాత్రం తాగి ఇ. హారి అనే ఆమె 18 ఏళ్ళనించి ఉందిట. వీళ్ళిద్దరూ ఇంగ్లండువాళ్ళే. ఇండియాలో, బంకూరాలో ఉప్పుకలిపిన నీళ్ళుమాత్రం తాగి, 56 ఏళ్ళనించి జీవిస్తున్న గిరిబాలాదేవి ఉంది [2920-4]. యుద్ధసమయంలో ఒక స్త్రీకి దొరతనంవారు దినవెచ్చం ఇయ్య సంకల్పించగా ఆమె తనకు అది అవసరం లేదనిన్నీ, తాను క్రితం 12 ఏళ్ళనించీ ఆహారపానీయాలు లేకుండానే జీవించు కొంటూన్నాననిన్నీ చెప్పిందట [ఇది ఆవారపత్రిక 3043 నెంబరు 6-వ పేజీలో 24-2-1940 తేదీగల సంచికలో ప్రచురం అయిన సంగతి గనక, సంతర్పణనాటికి గాని, సభనాటికి గాని, నేను ఇది తెలుసుగునీ ఉండలేను. 'కొయ్య' నూ లేదు.]

ఇక, భోజనపదార్థాలవల్ల కలిగే ఆరురసాల్లోనూ ఉల్బణ, అనుల్బణ, ఉల్బణానుల్బణ అనే 'ముయ్యాగు, భేదాల్లోకీ ఇప్పుడు వెళ్లను. అదీకాక, పదార్థం, రుచి, పాకం, రసం అనే మాటలు భోజనంలోనే కాక, కవిత్వంలోకూడా ఉన్నప్పటికీ అందులోకికూడా ఇప్పుడు ప్రవేశించను. ప్రవేశిస్తే మోతాదు ఎక్కువ అవుతుంది. ప్రాణాపాయం అనుకున్న వన్నీ ప్రాణం తీయవు, సరిగదా, ఒకఅవస్థలో ప్రాణాన్ని రక్షిస్తాయి. కాని, ప్రాణాధారం అని మనం అనుకునే అన్నమే మోతాదు మీరి విషం అవుతుంది. మాటలుకూడా అంతేగా! అగుతాను!

"ప్రాణాః ప్రాణభృతా మన్నం,<br>తదయుక్త్యా హినస్త్యసూన్." } అనిగదా మాధవుడు!

# లోకో భిన్నరుచిః

'లోకో భిన్నరుచిః' అనేది అంతా ఒప్పుకునే సంగతే, పైకి చిన్న వాక్యమే కాని, ఇందులో లోకం, భిన్నం, రుచి అనే మూడు మాట లున్నాయి. వీటిలోకల్లా భిన్నం అనే పదం ఒక టేసుళువు. ఏమంటే, జనం అంతా యథావసరంగా భిన్నం అవుతూండడం, యథాశక్తిగా భిన్నం చేస్తూండడం పరిపాటి. లోకం అనేది ఊహాతీతం. "లోకమంటే రేపుటి, గంజిగుంట అనుకున్నారా?" అంటాడు గిరీశం. అయినా, ఆ మాటకి ఎంత పెద్ద అర్థం ఉన్నా, అది మిక్కిలి సంకుచితంగా పుచ్చుగుంటేగాని బుర్ర ఆడదు. "ఏకాంశేన స్థితో జగత్." అదేనా ఎన్ని కోట్ల అంశాల ముత్తెంలోనో! రుచిగురించిన ఆలోచనకి పద్నాలుగు లోకాలూ అంటూ తలబద్దలు చేసుకోని అతలాకుతలం కావేంగదా! అగోచరాల్ని మొదటే మినహాయించాలి. ఆ గోచరించే వాటిల్లో అదృశ్యాల్ని తగ్గించెయ్యాలి. ఆ కనపడే వాటిల్లో అగమ్యాల్ని వదులుకోవాలి. అనగా నక్షత్రలోకాల్ని దూరవీక్షణమాత్రం చెయ్యాలి గాని గత్యంతరం లేదు. ఇక గ్రహాలోకాల్ని గురించి కూడా, రుచివిషయంలో, ఆలోచన కట్టేసుగోవాలి కాని, శుక్ర, అంగారక, చంద్రగ్రహాలలోకి మానవులు త్వరలోనే విహారించేటట్టు కనబడుతుంది. చంద్రుడిలోకి రేడియం సాయం

వల్ల రెండురోజుల్లో వెడతానన్నాడు ఒకాయన. బ్రిటన్‌లో బెన్నివిస్ మీంచి ఒక వెండి స్తంభం చంద్రుడిలోకి గిరవ య్యెడానికీ, గిరవేసిన వారంనాటికి అది అందులో పడడానికీ ఏర్పాట్లుచేశారనిన్నీ, యుద్ధంమూలాన్ని ఆగిపోయా రనిన్నీ తెలుస్తుంది. అలాగ్గా చంద్ర శుక్ర అంగారకుల్లోకి పాశ్చాత్యులూ, పాతాళవాసులూ వలసనిమిత్తం వెళ్లి వర్తక సామ్రాజ్యాలు స్థాపించగల సూచన్లు ఉన్నా, మన పని మామూలుకి లోటుండ కూడదు గనక వాటిని కూడా ప్రస్తుత ఆలోచనలో వదిలేద్దాం. ఇక భూలోకం. ఇందులో, స్థావరాలు వదిలేసి, జంగమాలలో భూజల వాయువుల్లో ఉండే క్రిమి పక్షి వృక్షపశులోకాలు వది లేసి (వాటికి రుచులు లేవనికాదు, అవి ఫలానా అని చెప్పాగో లేవుగనక!) మనుష్య లోకాన్ని మాత్రం విచారించాలి. వీళ్ళు, పోనీ, రెండువందలకోట్లు అందాం. వీళ్ళల్లో పశు ప్రాయుల్నీ, అతిబాలవృద్ధుల్నీ, అతీతుల్నీ, అపస్మారకుల్నీ, పిచ్చివాళ్ళనీ గీటెట్టి, తక్కినవాళ్ళనే రుచినిమిత్తం లెఖ్ఖకట్టు గోవాలి. పోనీ, అంతా ప్రమాణజనులే అని ఒప్పుకుందాం. ఇక తక్కినమాట 'రుచి.' ఒకానొక వస్తువుగాని, విషయం గాని ఒక ప్రమాణ మనుష్యుడి యొక్క నాలికవంటి గ్రహణేంద్రియంమీాద పడినప్పుడు, ఆ మానవుడు ఆ వస్తువుని గాని, విషయాన్ని గాన్ని ఏకొంతో హరాయించుగోడం వల్ల వాడియొక్క చైతన్యంలో వచ్చే పరివర్తనమే రుచి.

కాబట్టి రుచి అనేది కలగడానికి వచ్చిపడే వస్తువు రసవ ద్వస్తువూ, రసదాయకవస్తువూ కావాలి, నాలికకి తడీ వుండాలి. నాలికమీద పెట్టుగున్న వస్తువుకి నాలికతడిలో కరిగేగుణం ఉంటేగాని రుచి అనేదే జనించదు. బెడ్డ ముక్క, ఇసపముక్క, గాజు, రాయి — వీట్ల విషయంలో రుచి కనిపెట్టడం మామూలునాలికవల్ల కాదు. అల్లాగే, ఆకలిమీద ఉన్నవాడికి రుచికనిపెట్టడానికి సావకాశమే లేకపోబట్టి వాడికి అంతా రుచే. ప్రాణాధార వస్తువులలో రుచులు ఎన్నడం మామూలుగా ఉండదు. కాని పరిస్థితి మారినప్పుడు, "అబ్బ! ఈ వేసంకాలంలో మంచినీళ్ళ కున్న రుచి మరిదేనికీలేదు" అనడం వినిపిస్తూంటుంది. మాధుకరం ఎత్తుగున్నవాళ్ళు అన్నంయొక్క రుచి వర్ణించగా వింటాం. దారిద్ర్యంలో వస్తువుల్ని వదులుకోడమే కాకుండా "రుచులు దోసంబంచుః బోనాడ" వలసిన అవస్థవస్తుంది. ఏదేనా వస్తువుయొక్క నిరంతర స్వీకరణంవల్ల రుచి తెలియను. అయితే, ఒక సాధారణ మానవుడు ఒకవస్తువు తన నాలికమీఁద వేసుగున్నప్పుడు, ఫలిత రుచులు ఎన్నెన్ని విధాలుగా ఉండవచ్చును. అంటే 'చాలా' అని ఊరుకోడమే కాకుండా కొద్దిగా లెఖకూడా కట్టచ్చు. అందులో ఆ భోక్తయొక్క, ఆ వండినవాడియొక్క, ఆ వడ్డించినవాడియొక్క స్వభావ సంప్రదాయ వయోవస్థా సమయ సందర్భాలూ, తరవాత వస్తువుయొక్క వ్యష్టి సమష్టిభావాలే

కాక, మత్స్య మాంస ఫల ధాన్య శాక మూలాదిభేదాలలో ఘన ద్రవ ధూమాది ఉష్ణశీతల మిశ్రణాలు మొదలైనవి వీలైనంత వరకు గమనించి ప్రస్తరించితే ఫలితరుచుల సంఖ్య కోటాన కోట్లమీద ఉండవచ్చునని బోధపడుతుంది. అందువల్ల ఒకే మనిషికి ఒకే వస్తువుపరిస్థితులబట్టి లక్ష వేర్వేరురుచులు ఇవ్వడానికి వీల్లున్నప్పుడు, లోకం భిన్నరుచులు కలిగి ఉండేది అనిచెప్పడంలో ప్రమాదంలేదు, ఆశ్చర్యం లేదు.

[పై లెఖ్ఖ యీపత్తూ కడితే కొంచెం విసుగుగాఉంటుంది. కట్టకుండా వదిలేస్తే 'ఏముటో' అనిచప్పరించ బుద్ధేస్తుంది. అందుకని ఆశీర్షికల్లో నాలుగైదు మచ్చు చూస్తే ఈక్రింది మోస్తరుగా ఉంటాయి: భోక్తయొక్క నిత్యావస్థ — ఒంటరా, సంఘజీవా - బంధుసమేతుడా, అహితావృతుడా - శ్రమ జీవా, లంచగొండా - దరిద్రుడా, ధనికుడా - ఉత్సాహ యుతుడా, నిరుత్సాహపూరితుడా - నిర్బంధితుడా, స్వతంత్రుడా - లజ్జాన్వితుడా, మదాంధుడా - భయస్థుడా, సర్వాధకారా - కోపిష్టివాడా, శాంతుడా - తొందరవాడా, నిబ్బరస్థుడా అనేదాన్నిబట్టి రుచి వుంటుంది. ఆలాగే పదార్థస్థితి ఆలోచించినప్పుడు — ఘనమైతే కఠిన, మృదుల, స్థూల, చూర్ణ, భస్మ, స్ఫటిక, రేణు, రజ మొదలైన రూపాలూ, ద్రవమైతే జల, తైల, రస, మధు, పానక మొదలైన భేదాలూ వగైరాలనిబట్టి రుచి వుంటుంది. వస్తువు సంక్రమించిన రీతి గమనిస్తే, అది పిత్రార్జితమా స్వార్జితమా, పాతు దొరి

క్రిందా సవ్యంగా వచ్చిందా, కష్టార్జితమూ బలవంతంగా లాక్కొచ్చిందా, చోరీబాపతా దత్తమూ, యాచితమూ విక్రీతమూ, బహూకృతమూ అనేదాన్ని బట్టి రుచి ఉంటుంది. అదీకాక వస్తువు పచిత - అపచిత, పక్వ - అపక్వ, ఉష్ణ - శీతల, తప్త - ఆర్ద్ర, పూర్వ - ప్రస్తుత, మిత - అమిత, ప్రత్యేక - సాకల్య, వాయుహత - వాయురహిత, అవస్థల్ని బట్టి రుచి ఉంటుంది. చివరికి, అన్నదాత ఉద్దేశం హృదయపూర్వకమూ, వ్యాజపూర్వకమూ, ఇతరలాభం ఉద్దేశించా, పితృప్రీత్యర్థమూ, మిత్రప్రీత్యర్థమూ, అధికారికప్రీత్యర్థమూ, యశోవాంఛతోనా, ప్రాణపోషణ నిమిత్తమూ, ప్రతిఫలం ఆశించా, పాపపరిహారం చేసుగోవచ్చుననా—అనేదాన్ని బట్టి కూడా రుచి వుంటుంది. ఈ శీర్షికల క్రింద ప్రమేయాలు ఎక్కువగా ఆలోచించి రకాలసంఖ్య వేసినకొద్దీ ఫలితరుచుల సంఖ్య గుణకలితంగా పెరుగిపోతుంది. ]

ఇన్నిన్ని షరతులమీద ఆధారపడి ఉండడంవల్ల ఏ వ్యక్తి యొక్క రుచి ఆ వ్యక్తిది. ఇద్దరు వ్యక్తులరుచులు ఏలేశమో భేదించి ఉండడం సహజం. అచ్ఛంగా ఒకటే అయేటట్టు ఏకీభవించడం మిక్కిలి అపరూపంగాఉండే ఆశ్చర్యం! "మూడు మూర్తులా ఒకే పోలిక ముఖాలు గలవాళ్ళు ఇద్దరు దొరకవచ్చు గాని, ఒకేరుచి గలవాళ్లు దొరకరు." ఒకరి రుచి ఉన్న రీతిగా ఎందుకని ఉంటుందో చెప్పడం కష్టం, అడగడం వ్యర్థం. దండనవల్ల ఆకస్మికంగా అన్యరుచి కలిగించడంగాని, ఉన్న

రుచి లేకుండా చెయ్యడం గాని అసంభవం. అల్లా అని ఆగి పోవలసిందేనా ? జిహ్వావంటి దానియొక్క రుచి సంపదకి ప్రమాణం అంటూ ఏదేనా ఉంటుందా అనేది ప్రశ్న. అంతే, నీతిమాటేమిటి ? దానికి ఓ ప్రమాణం అంటూ లేదూ? ఎవరి నీతి వారిదే అయితే సంఘం నడుస్తుందా ? ఒక వీథిలో ఒకా యన దెబ్బలాట ప్రారంభించి, ఏమిటని అడిగితే "నాయిష్టం" అన్నాడు. ఇంకోఆయన "నీయిష్టం నీయింటిదగ్గిర, పోవోయ్!" అన్నాడు. అప్పుడు మొదటాయన, "నాయింటిదగ్గిర నా యిష్టం నాకు తెలుసు గనక దెబ్బలాడతాను, నాయిష్టం. ఇది వీథి గనక పబ్లిగ్గా దెబ్బలాడతాను, నా యిష్టం!" అని యింకా దెబ్బలుతిన్నాడు. ఏమయితేం గనక, ఎక్కడపడితే అక్కడ ఎవడియిష్టం వాడిదేనా, ప్రతీవాడియిష్టం ఒప్పేనా ? ఒక అంఖడమైన సంతర్పణ జరుగుతూండగా, పోపుల ఘుమా యింపు వీథివీథీ వ్యాపించగా, బారులు తీర్చి కూచుని జనం ఆరగిస్తూండగా, ఒకవ్యక్తి "ఏముంది ఇందులో ! ఈభోజనం నాకు రుచించలేదు. నాయిష్టం, నారాజ్యం. నేను మన స్సాక్షిగానే చెబుతున్నాను. ఏడిసినట్టుంది. నాకు అల్లా అని పిస్తోంది. నాకు అల్లా అనిపించకూడదు అని ఏమన్నారూల్సా!" అంటా డనుకోండి. అతగాడి త్రికరణశుద్ధి రుజువు చెయ్యడం అసాధ్యమే కాని, వాడి రుచిప్రమాణం చాలా హెచ్చుతగ్గుగా ఉందని మాత్రం అనచ్చు. వాడు సుస్తీ మనిషిగాని, కాయిలా మనిషిగాని, దీర్ఘరోగి గాని, అసూయాపరుడుగాని,

దాంభికుడుగాని, అన్యాపేక్షగలవాడుగాని, అప్పుడే మెక్కి-వచ్చినవాడు గాని, తిండికి వేళపాళలు లేనివాడుగాని, ఆ పదార్థాలు జీవితంలో తెలియనివాడుగాని, స్థితప్రజ్ఞుడు గాని అయిఉండాలి. నాకు రుచించని ఒకవస్తువు ఇతరులకి రుచించి తీరాలని పట్టుపట్టడం మూర్ఖత్వం. ఇతరులకి కూడా ఎందుకు రుచించకూడదు — అని అనుకోడం దురాశ. ఇతరులకి కూడా రుచించదు గదా అనుకోడం బుద్ధి తక్కువ. ఏమంటే, అది ఇతరుల్లో కొందరికి మిక్కిలి రుచికరమైనదే అయిఉండవచ్చు; లేదా సకలజనులూ కూడా అసహ్యించుకునేదై ఉండవచ్చు. మొదటిసందర్భంలో ఆ వస్తువు మీద నేను ద్వేషం పెంచుగోరాదు. ఎన్నెన్నిమాట్లో రొట్టలువేస్తూ, ఎంతో రుచికరం అని మెచ్చుగుంటూ, ఇతరులు ఒకవస్తువుని ఆరగించేటప్పుడు, పక్కనే నేను బైటాయించి, అది నాకు రుచించకపోయిన కారణంవల్ల, తింటూన్న వాళ్ళ సమక్షంలో, నాకు హక్కుండిగదా అని చెప్పేసి నేను డోక్కోడం ప్రారంభించడం ధర్మంలా కనబడదు. తినాతినక, తినానియ్యక కంగాళీ చెయ్యడం మానవేతరమైన లక్షణం. కాని, అంతమంది తినేస్తూన్నది మేడిపండు గదా అనే సంగతి వాళ్ళల్లో ఏ ఒకడికీ తెలియక, నా ఒక్కడికి మాత్రమే తెలిసి ఉండడం సంభవిస్తే, అనేక ప్రాణరక్షణకోసం నేను అడ్డుపడవలసినమాటే ! అంత అహంభావత్వానికి అవసరం నాకు ఉందని తోస్తే అల్లా చెయ్యనూవచ్చు ! ఏమైతేం, అదృష్టవశం

చేత ప్రాణాపాయకరం అయినవస్తువులు రుచికరం కాక పోడమే, కాక, దుర్వాసనతోకూడా కూడిఉండడంవల్ల, ప్రతీ మానవుడూ తను తినేవస్తువుల్లో ఎదోరుచి ప్రమాణం పెట్టుకునే వ్యవహరించడానికి వీల్లున్నాయి, వ్యవహరిస్తూ ఉంటాడు. వాసనఅంటే జ్ఞాపకంవచ్చింది. రుచులన్నీ కూడా వాసనమీదే ఆధారపడి ఉన్నాయని ఒకవాదంఉంది. నమ్మ వచ్చు. ఎవరికేనానమ్మకం లేకపోతే, మిక్కిలిరుచికరం అని తమరు నమ్మేవస్తువులు తమరు తినేటప్పుడు కాస్సేపు తమరు ముక్కు మూసుగుంటే పై వాదం బోధపడుతుంది. ఎవరి కేనా నూతనపదార్థం తినడానికి ఇచ్చినప్పుడు వాడుముందు వాసనచూసి తరవాతే నోట్లో వేసుగోడం అందుకనే! మొత్తంమీద, భౌతికరుచులుగల వాళ్లల్లో, వంకాయకూర ఫస్టూ, ధప్పళం బెస్టూ, పులావ్ నెంబర్ వన్ అంటూ వేర్వేరుగా మెచ్చుగున్నా వాళ్లందర్నీ ఒకతరహాలోనూ, కుళ్లు అన్నంఫస్టూ, బూజు ఊరగాయబెస్టూ, ఉచ్ఛిష్టం నెంబర్ వన్ అనేవాళ్లందర్నీ మరోతరహాలోనూ కట్టితీరాలి.

ఇక్కడ నిదానించి రెండుసంగతులు గమనించాలి. లోకం అంటే (రుచినిమిత్తం) మనుష్యులే అన్నాం. మనిషికి శరీరమే కాకుండా మనస్సూ, ఆత్మాకూడా ఉండాలి, జిహ్వాకాకుండాముక్కూ, కళ్లూ, చెవులూకూడా ఉంటాయి. ముక్కు పోడుంపీల్చడానికి మాత్రమే అనిన్నీ, కళ్లు ఎందుకంటే మూసేసుగుని భోంచెయ్యడానికనిన్నీ,

చెవులు ఎందుకంటే భోజనానికి లెమ్మంటున్నారేమో అనే సంగతి వినడానికననీన్నీ అనిసమర్థించి పారెయ్యడం మానుషం కాదు. ఉల్లిపాయ, ఇంగువ, సంపగి, పనసవంటివాట్ల విడి సుగంధాలు బ్రహ్మాండంమీద కనిపెట్టేవాళ్లు చాలామంది ఉన్నారు. రాతిముక్కలు కలిగి ఏబాధాలేనివాళ్లున్నారు. బస్తీవాసనకి మరిగినవాళ్లుకొందరు గ్రహించగల సువాసనలు ద్వివచనంలోకూడా ఉండేటట్లుతోచదు. కాని ఘ్రాణేంద్రియానికి సంబంధించిన అభిరుచులు గలవాళ్లు జపానులో విస్తారంగా ఉన్నారననీన్నీ, సుగంధమిశ్రణాలు చెయ్యడం జపానులో ఒక గొప్ప నాసికాకళ అనినీన్నీ తెలుస్తుంది. జపానీయులలో కొందరు గంధరుచిలో ఆరితేరినవాళ్లు రెండుమూడు వందల మిశ్రణ సుగంధాలు పోల్చగలరట — గానరుచి గలవాళ్లు రెండుమూడు వందల రాగాలు పోల్చుగున్నట్టు. అలాగే నేత్రాలవల్ల వర్ణ రూప చిత్ర శిల్ప నిర్మాణాల సంగతి గ్రహించేరుచి మానవుడికి ఉండాలి, చిన్నప్పుడు రంగుబొమ్మలంటే శిశువుకివుండే అసక్తే దానికి ప్రాతిపదిక. బొమ్మరిల్లు కట్టి ఆడినప్పటినించీ శిల్పం అంటే మానవుడికిరుచి. మొత్తని గూడు కట్టుకోగల పక్షులకే ఆప్రజ్ఞేసహజంగాఉంది. మానవుడు ప్రకృతిలో దృశ్యాలూ, మానవకల్పిత చిత్రాలూచూసి ఆనందించగల రుచి పెంచుగోవాలి. అది రంగులతో సంబంధించిన కళగనక దాన్నిగురించి మాటలు ఎన్ని చెప్పీ లాభంలేదు. జీవకళ లేని బొమ్మలీన్నీ, సంకరజాతిచిత్రాలీన్నీ, పచ్చిబోడి కుళ్లురకం

పటాల్నీ, పెంటకొండల్నీ, మురుగుప్రవాహాల్నీ చూడడంలో ఎవడికేనా అభిరుచిఉంటే అది కేవలం నాసిరకం అభిరుచి అని చెప్పడం తప్పుకాదు.

ఇక్కడ ఒక ఉపవిషయం! ధర్మ అర్థ కామ మోక్షాలు అనే పురుషార్థాలయందు అభిరుచి ఉండడంన్యాయంగదా అని పెద్ద లంటారు, పిన్నలు వింటారు, 'పోదుసూ' అంటారు. (ధర్మం అనేమాటకి సంస్కృతంలో ఉండే అర్థం తెలుగులో సూక్ష్మార్థంకాదు. ధర్మం అంటే శాస్త్రాచార విహితమైనదాన్ని బట్టి మానవుడు ప్రపంచంసాగడం నిమిత్తం చెయ్యవలసిన పని, ఆపనియొక్క నిర్ణయవాక్యం అవి సంస్కృతంలో. దానం అని తెలుగులో. తెలుగు లోకి దిగిన సంస్కృతపు మాటల గురించిన నిఘంటువుల్లోకూడా తెలుగులో ఆమాటలకుండే సూక్ష్మార్థాలు ఇచ్చిఉండకపోవడం అధర్మం). ప్రస్తుతకాలంలో చాలామందికి అర్థకామాల్లో మాత్రం అభిరుచిఉన్నట్టు తెలిసిపోతుంది. అవి రెండూ భౌతికమే. అవిగాక నాగరికతయొక్క మహాత్మ్యంవల్ల ఆకస్మిక గౌరవాభిరుచి, అధికారాభిరుచి, ఘోషణాభిరుచి, ప్రచారాభిరుచి, సౌకర్యాభిరుచి, సద్యః ఫలితాభిరుచి, ఆశ్రయత్వాభిరుచి, పరభృతత్వాభిరుచి, సగౌరవ తస్కరణాభిరుచి, సవినయదంభాభిరుచి, మరి యింకా ఇటువంటివి ఎన్నెన్నో పుట్టించుగుని, బలవంతంగా లాక్కుని తెచ్చి పెట్టుగుని, పెంచుగుని, పోషించుగుని అవన్నీ కాంతా

కనకాలనిమి త్తమే అని జనబాహుళ్యానికి బోధపడకుండా నక్కవినయాలూ, సమయానుకూలనటనలూ చేస్తూ, కేవల మోక్షార్థులై ధర్మాచరణకి ఉద్యుక్తులైనట్టు కనిపించే మానవులు తక్కువగా ఉన్నారని భయపడవలసిన అవసరం లేదు. దేవుడు పక్ష బుద్ధిపొరపాట్లలో తమకి మానవజన్మ ఇవ్వడం అధమం ఒకటి అని దేవుడి సమక్షంలోనే రుజువు చెయ్యదల్చుకుంటూ, ఇటువంటి బుద్ధిమంతులే అని చెబుతారు మరి!

శ్రవణేంద్రియానికి సంబంధించిన శబ్దాలతోనే ఉండే శాస్త్రాలయందు అభిరుచి ప్రశంసనీయం. ఆ అభిరుచి కలగడానికి బుద్ధి, శ్రద్ధ, అభ్యాసం అక్కరగనక అది అందరికీ అలవడదు. కాని, హృదయం ఉంటే సరిపోయే గాన కవిత్వాలనుగురించిన అభిరుచి సర్వజనసాధ్యం. అభిరుచి అంటే ప్రజ్ఞ కాదు. ఒక విషయంలో ప్రజ్ఞ అందరికీ లేకపోవచ్చుగాని అభిరుచి అందరికీ ఉండవచ్చు. గానంలో జంత్రగాత్రాలు, కర్ణాటు, గవాయి, హిందూస్థానీలు, శాస్త్రకట్టు, గాలిపాట, డ్రామాస్టయిలులు, శ్రుతి లయ రాగ తాన కీర్తనలు విరివిగా పెంచి గమనిస్తే అభిరుచులు వేనవేలని తేలగలదు. వాటిలో వీణాదివాద్యాలు చెయ్యబడ్డప్పుడూ, భజనతత్వ కీర్తన్లవంటివి సార్థకంగా గానం చెయ్యబడేటప్పుడూ వినాలనే అభిరుచి ఉత్కృష్టం, దివ్యం! కాని, పశుశృంగారపు వర్ణనలతో ఉండే పచ్చి జావళీలు వినాలనేది భౌతిక అభిరుచి.

ఇక కవిత్వంగురించిన అభిరుచులూ మిక్కుటమే.

తటస్థ - నీతిబోధక, శ్రోత్రియ - సాంస్కారిక, శాశ్వత - తాత్కాలిక, స్వీయ - పర, సనాతన - ఆధునిక, గ్రాంధిక - వ్యావహారిక, ముద్రిత - లిఖిత (స్వ - పర), జనప్రియ - అపరూప, సచిత్ర - చిత్రరహిత, గ్రంథస్థ - పత్రస్థ స్థితుల్లో స్వ - పర భావలలో ఉండే పద్యగద్యాభిరుచులు. పద్యవిషయంలో పురాణ ప్రబంధ శతక దండక చంపూ కావ్య గేయ చాటు ఆశు మొదలైన రకాలలో ఛందోభేదాలతో ఉండే నాద పద అర్థ భావ అలంకార సందర్భాల గురించిన రుచులు. గద్య విషయంలో మసన కథన వర్ణన భాషణ రూపాలలో లేఖ వ్యాస చరిత్ర నవల విమర్శ మొదలైన భేదాలలో ఉండగల రుచులు. ఆపైని, కర్త, గ్రంథం, గ్రంథభాగం మొదలైనవాటినిగురించి చదివేవాడు విద్యార్థి, పరిశోధకుడు, పారాయణ చేసేవాడు, కాలక్షేపం చెయ్యదల్చినవాడు మొదలైనవాటిని పురస్కరించుకుని రుచులు ఎక్కువగా ఉండగలవని చెప్పవచ్చు. ఇటువంటి రుచులన్నీ సమంజసములే, సదభిరుచులే, గొప్పవే. అన్ని రచనలమీదా అందరికీ అభిరుచి ఉండదు, ఉండడం సహజంకాదు. ఇద్దరి అభిరుచులు వేర్వేరు అయినప్పుడు ఆశ్చర్యపడకూడదు, ఒకర్ని ఒకరు తేలికగా చూసుగో నక్కర్లేదు సరిగదా, ఏకీభవించినప్పుడు చాలా అద్భుతపడి ఆనందించుకోవచ్చు. కాని, హృదయంమీదగాని, బుర్రలో గాని వేసుగోకుండానే రుచి లేదనో ఉందనో చెప్పేవాడూ, పిండినా, పిండి

పిండి అయినా తడికక్కని పాషాణరచనని చప్పరించకుండానే మింగేసి మహారుచిగా ఉందనేవాడూ, గతించినవాడి కవిత్వంగనక 'రుచివంతం' అనేవాడూ, పేలునుబట్టి తన కుటుంబ, తన శాఖ, తనవర్ణ, తనజాతి, తన భాష తన దేశ రచనకాబట్టి "రుచిగానే ఉందిస్మీ" అనేవాడూ, వేడి వేడిరచన ప్రతీదీ రుచివంతం అనేవాడూ (అసలుఅప్పట్లో రుచే తెలియదు నిజానికి !) తన శత్రువురుచి కనుక్కని దానికి భిన్నంగా ఉండేదే తన రుచి అనే వాడూ - వీళ్ళంతా సుస్తీగా ఉండే రుచులు గలవాళ్ళే. అల్లాంటి దగాలో పడిపోయినవాళ్ళని కాలం తిన్నపరుస్తుంది. వాళ్ళు నిమ్మళంగా అన్యులు కనిపెట్టకుండా అభిరుచిమార్చుగోవలి సొస్తుంది. మార్చుగుంటారు. అందుకని ఏగొడవాలేకుండా కాలం చేత మన్నింపబడ్డ తెలుగుమహాకవుల రచనలంటే అభిరుచి కలిగించుగోవడం సాధారణ తెలుగు మానవుడి ధర్మం. ఆరీతిగా మానసిక ఆనందం గలిగించే ఉత్కృష్ట అభిరుచులు లేని మానవజన్మ వ్యర్థం, ఉసూరుమనే రకం, దివాలా సరుకు! ఇదికాక, జీవుడూ, జీవితరహస్యమూ గురించిన అభిరుచి కూడా ఆత్మానందం ఇచ్చేదిగనక మానవజీవితానికి ముఖ్యాతిముఖ్యం. వీటి అన్నింటిలోనూ కూడా, అవతల రచయిత ప్రసాదించేది రసవద్వస్తువు కావలసిన అవసరం ఎల్లాగైతే ఉందో, అల్లానే నాలిక తడిగలది అయినట్టుగా హృదయం తడిగలదై ఉండాలి. అప్పుడుగాని రుచీ ఉండదు, రచీ

ఉండదు. ఇతరసుగుణాలలాగే సదభిరుచులు పెట్టిపుట్టాలి. అవి సన్మార్గంలో అభివృద్ధిచేసుగోనూవచ్చు. ధనం, కాలం స్వల్పంగా అందునిమిత్తం త్యాగంచేసి దీక్షగా అభ్యసించడం చాలు. ఏకొంచెమో ఏదో త్యాగంచేసి సంపాదించుకుంటేగాని ఏదీ రుచించదు. అభిలాషతో, ఆసక్తితో ఆ ఆచరణలో ఉండి, ఆగాలే పీలుస్తూ త్రికరణశుద్ధితో ప్రయత్నించి తన భాషలో అన్ని వేలరకాలలో ఏబాపతో ఒక బాపతు కవిత్వం అంటే అభిరుచి ప్రతివాడూ పెంచుకోవచ్చును! అటువంటి ప్రతీవాడికీ కేవల భౌతికరుచులేకాక, మానసిక ఆత్మిక అభిరుచులు ఉంటాయి గనకనే, పూర్వమహాగ్రంథాల్లో చిన్న చిన్న ఘట్టాల చివరా, ఉపాఖ్యానాల చివరా "ఈ కథ, ఈ ఉపాఖ్యానం, ఈ సంవాదం ఎవడేనా శ్రద్ధతో విన్నా, తనకోసం చదువుకున్నా, ఇతరుల కోసం పఠించినా, వ్రాసుకున్నా, వ్రాసిపెట్టినా మోక్షం ఉంటుంది" అనే మోస్తరుగా చెప్పి ఉంటుంది. ఆ ముక్కలు మానవుడికి ఉండగల మహత్తమఅభిరుచిని మెచ్చుగునేవిగనక, శిలాక్షరాలు. ఇంకా ఏమంటే, ఆమనిషికి కేవల పాశవం కానటువంటి ఉత్కృష్ట అభిరుచి కలుగుతుంది గనక! ఏమిటీ ఆ అభిరుచి ఫలం? సచ్ఛీలమే, అది పురుషార్థం కావచ్చు గదా! ఒక మహామహుడు చెప్పిన సందేశం ఇది:

"అభిరుచి బండ, మోటు, సున్నితం అవడాన్ని బట్టి జీవితం అసారం, పాశవం, దివ్యం అవుతుంది. ఒక

సామ్రాజ్యానికి మొద్దుస్వభావపురాజుగా పుట్టేకంటే దరిద్రుడైనా సదభిరుచులు కలవాడుగా పుట్టడం నెయ్యివేలు. దేవప్రసాదమైన ఈ అభిరుచి వరంలేనివాడే, ఎంత అదృష్టవంతుడటకానీ, సౌఖ్యం ఎక్కడ?"

---

# స్థాయి మారినా వోటే పాట!

వోటుకి కొత్త అర్థాలు వస్తూనే ఉన్నాయి. వోటంటే నిలబడ్డవాడు పడిపోకుండా ఉండడానికి ఇతరులు పెడుతూండే 'బోటు' అని ఒక 'వబయోరభేదః' గారు అన్నారని తెలిసింది. వోటంటే భూమిమీద ఏస్థలంలో నైనా సరే ఒకే తూనిక గలిగి ప్రత్యేక మానవవ్యక్త్యభీష్టాన్ని సూచించే నిర్గుణబ్రహ్మం అని మరొకరి అభిప్రాయం. జంతువుల గురించిన వోట్లున్నా వాటి మీద లాభం మానవులే సాధించుకుంటారు. రాజకీయ సంబంధపు ఎన్నికల్లో హిరణ్యం, రజతం, తామ్రం, లోహం, భూమి, లవణం, ద్రవ్యం, రసం మొదలైనవి వోటు దానానికి నిమిత్తకారణాలు అవుతూంటాయి. విద్యావిషయిక మైన ఎన్నికలలో గౌరవాధికార పరిచయ బాంధవ్యాలతో కూడిన భాషాసాధనాలు చాలామట్టుకి మొహమాటం లేకుండా పనిచేస్తాయి. వోటువ్యాపారం రెండు దృక్పథాల్నించి చూడాలి: ఒకటి — అభ్యర్థి అనబడే వోటర్థి గమనించేది. రెండు — వోటు దానం చెయ్యగల వోటరు అనుకునేది. ఒక వోటర్థి అనుభవానికి నమోనా ఇది:

* * * *

"ఎప్పుడు ఎన్నికలు పెట్టినా ఎవరో ఓరు నెగ్గుతూంటారు. అల్లానే కొందరు నెగ్గారు. వాళ్ళలో ఒకాయనభార్య మా ఆవిడతో మాట్లాడ్డంలో మాఆవిడకి చాలాచిన్నతనంగా ఉండే

టట్టు తనభర్తయొక్క విజయవైభవం వర్ణించుగోడం మొద లెట్టిందట ! నాకున్న సుగుణ సంపత్తికి శిఖరంగా ఎన్నికల్లో విజయంకూడా ఉంటేగాని తీరని లోటు కనిపిస్తూనే ఉంటుందని నాకు మొదట్లో సవిచారంగా ఉపదేశించింది మాఆవిడే. తర వాత నా ఆంతర్య స్నేహితుడొచ్చి నాకుగల మహత్యంతో నిష్కామంగా మానవసేవ చెయ్యడానికి నేను నడుంకట్టినట్టు తక్షణం ప్రకటించక పోడం అనేది ఆంధ్రదేశానికి అరిష్టహేతు వన్నాడు. ఇంతలో మా యింట్లోవాళ్ళూ, స్నేహితులూ, నాకర్లూకూడా నాఅంతవాడికి ఓగొప్పపదవి ఉంటేగాని రాణింపే ఉండదన్నారు. దాంతో, నాకు, బాధ్యతలేని ఆ గౌరవస్థానం ఎప్పుడు ఆక్రమిస్తానో గదా అనే ఆరంభస్పృహా కలిగింది.

అభ్యర్థిని నేనొక్కణ్ణే అయితే తీరిపోదూ ? తప్పకుండా నాకోరిక సిద్ధించేదిగా ! కాని యింతమాత్రము ఆలోచనేనా లేక, దుర్మార్గుల సలహాలకి లొంగిపోయి మరో అయిదు గురు — మాంచి రాళ్ళంటివాళ్ళు — ఆపదవికే, నామీద పోటీచేస్తూ నిల్చారు. ఎంత కక్కుర్తో చూడండి. నేను వాళ్ళ మీద చెయ్యవలిసొచ్చిన ప్రచారంలో ఉండే రసికతా, నామీద ఆ వోటర్థులు వొట్టిపుశ్యాన్ని సాగించుతొచ్చిన దుష్ప్రచారంలో ఇమిడిఉన్న కుళ్ళూ నేను జనానికి బోధపరుచుగు రావడంలో కొంత నవ్వులాట బయల్దేరింది. పైకి చేసే ప్రచారంబట్టే (అనగా, చెవులు చిల్లులుపడేటట్టు వాయించుతూండే రుంజాల్ని

బట్టే) జనబాహుళ్యం నమ్ముతుంది, ఆ ప్రచారమే నేర్పుగా చేసుకోవలసింది. అని నా అంతర్యస్నేహితుడు నాకు కిటుకు చెప్పనే ఉంచాడు. అల్లానే బోధించేవాళ్ళు వాళ్లకి ఉంటూ చ్చారు గావును. ప్రచారవిషయంలో ఓడి కోడు తీసిపోయివాడు మాలో లేనే లేడు. ఓం ప్రథమం నేను అరువుసొమ్మూ తేర సొమ్మూ పెట్టి ఎన్నికల్లోకి దిగానని ఓఅభ్యర్థి నన్ను ఏకడం ప్రారంభించాడు. దానికి జవాబుగా వాడికి అల్లాంటి సొమ్ము లేనా దొరకేమాత్రపు పరపతేనా లేదనిన్నీ, వాడు కలిగి ఉన్న కాస్త ఆ స్త్రీకూడా అక్రమంగా వేసేసుకున్న దనిన్నీ నేను యథార్థం చెప్పెయ్యవలి సొచ్చింది. మరోఅభ్యర్థి నాకు పలుకుబడి లేదని ఆక్షేపించాడు. వాడికి పలుకుబడి కాదు రాబడికాని, అసలు ఏబడిగాని లేదని నేనుఅనేసి వాడికి వాగ్బంధం చేసేశాను. జాతిమతాభిమానాలు అల్లా ఉండగా శాఖాంతరాభిమానాలు తవ్వి పైకితోడి, (ఏ అంతశ్శాఖకి ఎవరు చెందుతారో తెలిసేది ఎన్నికల్లోనే) వాటిబలంతో నేను జనాన్ని నావైపు తిప్పుకుంటూన్నానని ఇంకోడు దండోరా సాగించాడు. ఆ మాత్రం శాఖాభిమానంకూడా ఉండకూడ దనేవాడు తనశాఖని మట్టుకి ఏమంత ఉద్ధరిస్తాడూ, వీడు వొట్టి డాబుల్రాయుడూ, వీణ్ణి నమ్మేరుగనకా — అంటూ వాడి శాఖవాళ్ళల్లో ప్రచారం నేను చేసి, వాళ్ళు నాకు అనుకూలించకపోయినా వాడికి ప్రతికూలించేలాగ చేసేశాను. మరో పోటీదారు నాకు తెలివితేటలు సున్నా అనిన్నీ, నేనే

గనక పదవిలోకి వెడితే అక్కడ మట్టి విగ్రహంలా కూచో వాలిగాని మరోపని చెయ్యడానికి చాలననిన్నీ అన్నాడని నాకు రూఢివార్త తెలిసింది. ఒకరి తెలివితేటలమీద ఇంకోరు రిమార్కు చెయ్యగానే ద్వేషం అంకురిస్తుంది; వెనకే ద్వేషం ఉంటే అది ఘనీభవించి ఖాయపడుతుంది. అందులో నాఅంత తెలివిగలవాడిమీదా అవతలవాడి తెలివి తక్కువ విమర్శ! నాకు చిరునవ్వు చక్కా వచ్చింది. ఆమట్టున, అవతల అబ్బి అక్కడక్కడ తన తెలివి గుమ్మ రిస్తున్నాడట, ఓఅంధజనమా! మోసపోవద్దూ, ఆ అభ్యర్థి ప్రవర్తన హేయం, వారిశీలం దుర్భరం, వారి వాలకం రాక్షసం, వాణ్ణి ఆపదవిలోనికి రానిస్తే దేశానికి కీడు మూడిందన్న మాటేనూ! – అంటూ ఎంతో బాధపడుతూ, తప్పనిసరివల్ల నేను రహస్య ప్రచారం చేయించవలిసొచ్చింది. వేరే ఒక పోటీదారు నామీద ప్రతికూలప్రచారం చేస్తూ నేను ఈపరకే విజయానికి ఆశవదులుకున్నాననిన్నీ, నాకు విజయంకంటే అపజయం అంటేనే ఎక్కువ మక్కువ అనిన్నీ స్వాపజయంవల్ల జీవితసమస్యా, మానవ స్వభావమూ గ్రహించదల్చుకున్నాననిన్నీ, ఈమాటలు పబ్లీకులో చెప్పేశా ననిన్నీ ఉపన్యసించి జనాన్ని నావేపునుంచి లాగే స్తున్నాడని తెలిసింది. అవన్నీ బానిసతత్వంవాళ్ళ ఊహ లనిన్నీ, నేను (ఒకవేళ) అయినసొమ్ముకీ, నశించిన ఆస్తికీ, ఉడిగిన శక్తికీ, పడ్డ శ్రమకీ, తగులడ్డ కాలానికీ ఆశవదలు

కున్నా విజయంగురించి ఆశవదలుకోననిన్నీ, అల్లా నేను పైకికూడా అనేశా ననడం మానసికతత్వంయొక్క అజ్ఞానానికి సరియైన ఉదాహరణ అనిన్నీ ఝూడించేసి వాడి ప్రచారాన్నీ వాణ్ణీ కట్టేశాను.

నేను నాలుగైదు సార్లనించి నిలబడి చూస్తున్నాననిన్నీ, అంతపట్టుదలా ఓపికా ప్రత్యక్షంగా కనపరిచినా వోటర్లు నన్ను ఎన్నుకోజాలకపోడం అనేది దేశదౌర్భాగ్యం అనిన్నీ రాస్తూ, ఆ రచనలో ఎక్కడోఓమూల అస్తమానం ఒకే ఫలానావ్యక్తి నెగ్గాలని ఎక్కడేనా ఉందా, పదవికి ఒకడంటూ పుస్తెకట్టేవా డుంటాడా, అందుకని పాడిందే పాడరా అన్నట్టు వెనకటివాళ్లనే ఎన్నుకని తరుణం తగలేసుగోకండి, రకం పిరాయిస్తూండడంలో సబబుందని ప్రకృతి చెబుతుంది, పాతరకాలు పోవడంలో శ్రేయస్సుంది అంటూ ఒక ప్రకటనలో దంచాను. దాంతో ఒకపోటీదారు చెలరేగిపోయి, నాకు సమాధానం చాలా పడిసినట్టు రాస్తూ "అస్తమానమూ తెలివి నీకే ఎందుకూ, ఇంకోడికి బదలాయించు! ఎల్లప్పుడూ డబ్బు నీకుటుంబానికే ఎందుకూ, తక్షణం మరోడికి ముట్టచెప్పు! ఎల్లకాలమూ పాండిత్యం నీలోనే ఎందుకూ ఇతరుడికి ఇంజెక్షన్ ఇచ్చేయ్! ఏళ్లతరబడి సౌందర్యం నీలోనే ఎందుకూ, మరోడికి దఖలుపణ్ణే!" అంటూ రాసి, నామీద అతనికి ఉండే ఈర్ష్య యావత్తూ కక్కిపోసుగున్నాడు. అధికారరీత్యా ఒకపోటీదారు ఒత్తుడు

చేసి నా బంధువుల్ని కొందర్ని గుండకొడుతున్నాడని నేను ప్రచారంచేశాను. ఆమీదట నాబంధువులు వోటు ఎవరికి వేశారో నాకు తెలియదు చెప్పలేనుగాని, వాళ్ళఉద్యోగాలు లేచిపోయాయి. కొందరు వోటర్లని తాగించి మతిలేకుండా చూసి ఆ మతిలేని వోట్లు నేను ఆర్జించుకున్నానని మరో వోటర్థి మొదలెట్టాడు. సరి ఆ అభ్యర్థి అసలే మతిలేనివాళ్లనీ, మతిగురించి సందేహమే లేనివాళ్లనీ, చచ్చిపోయినవాళ్లనీ, మిథ్యాజనాన్నీ పడగొట్టించి తసపక్షం పలికింపించుకున్నాడని నేను బయటపెట్టేశాను.

ఈకోలాహలం బహిరంగంగానే జరిగిపోతూండేది. కాని. ఒంటరిగా ఉన్నప్పుడు రాత్రిళ్లు కన్ను మూతపడేదికాదు. అన్నం సయించేదికాదు, అన్నానికి వేళే తెలిసేదికాదు. ఒక్కొక్కప్పుడు చిమ్మే సొమ్మూ, పడే మాసిగలూ, చేసే ఏర్పాట్లూ, బనాయించే ఉత్తరాలూ, పట్టుగునే కాళ్లూ, ఖర్చుపెట్టే స్తోత్రాలూ, ఇచ్చే వాగ్దానాలూ, కప్పెట్టుగునే లోట్లూ, అభినయించే వినయమూ జ్ఞప్తికివచ్చి, “అయ్యో! ఎందుకో గదా ఈ హోమం! నేను వెళ్లి ఎక్కడ ఆహుతి అయిపోతానో గదా! స్వంతపనిమాని సంతలోజేరి నేను చెయ్యగల లోకపరివర్తన ఏముటో గదా! అవిచ్ఛిన్నంగా ఒకానొక అజ్ఞాతకర్మ గురించి నాజీవితం ధారాదత్తం చెయ్యడానికి నా ప్రస్తుతపు సంసారబాధలు ఎల్లా దిద్దుకోగలనో గదా! ఈ సడమంత్రపు గౌరవం నిమిత్తం, ఈ అవాస్తవ

అధికారం నిమిత్తం ఈమాయాదారి పరుగు నా కెందు కొచ్చిందీ! అధమం ఈసొమ్ము ఏ బీదసాదల కేనా పాత్రత చూసి దానంచేస్తే తీరిపోయేది!" అనిపించి, నేను బొరుమని ఏడుస్తానా అన్నంత విచారంకలిగి, నేను పైకికూడా అట్లా కనిపిస్తే నాపక్షం శ్రమపడే కాసినిమందీకూడా ఎక్కడ మాయం అవుతారో అనే భయంచొప్పున ఆ శోకం లోపల లోపలే కానిచ్చుగుని, ఒంటరిగా ఉన్నప్పుడే పూర్తికూడా చేసుగుని, ప్రజల్లో పడుతూండేవాణ్ణి.

అంతలో శకం మారినట్టు అనిపించేది. ప్రతీ ఇతరఅభ్యర్థీ నన్ను చిన్నపరచడమూ! అల్లానా తమ పెద్దరికం దాఖలా పరుచుగోడం? నేనేం తక్కువతిన్నానా, తక్కువ తూగు తానా! మనిషైనప్పుడు లక్ష లోట్లుండచ్చు, ఉంటాయి. ఉంటే? చూసేవాళ్లు లేకగాని ఈ యితర అభ్యర్థు లం దర్నీ చుట్టబెట్టినా నాకు సమంకాగలా? నావైఖరి గాని, రీతిగాని, చివరికి రోషంగాని ఏ ఒకడికి ఉందీ! నాసిరకాల్ని పైకి లేవనెత్తి నెత్తిన ధరించి, పాలించ మని వాళ్లని హాయాంలో పెడితే ఆపళంగా దేశం తగులడిపోతూంటే చూసి చూసి ఊరుకోలేక, రోషపౌరుషాలు అనాదినించీ ఉంటూన్న వంశంలో ఉద్భవించిన మణిపూస వంటివాణ్ణి గనక నేను ఇందులో ప్రవేశించానుగాని, లేకపోతే నాకేం పట్టిందీ? నా నిలువెత్తున ధనంపోస్తేమాత్రం ఇందులోకి జారబడతానా? అసలు నాలిక తెంపుగుంటే మాత్రం దర్శనం

ఇస్తానా? అంతరోషాన్నీ హాలాహలాన్నిలాగ దిగమింగి, అనర్హులూ, అజ్ఞానులూ, అనామకులూ, అనర్థులూ అయిన జనందగ్గిరికి వెళ్లి వాళ్లని మన్నించి వాళ్లని దేహి అని వోటుభిక్ష నోరువిప్పిఅడిగి, వాళ్లలో కొందరికి ఉత్త రాలు రాయించి, జ్ఞాపకంచెయించి తంటాలుపడడం ఎందు కంటారు? "రోషంగల వ్యక్తినయ్యా! నన్ను అసలు మీరు కాళ్లు పట్టుగుని బతిమాలు కోవలసిన మాట. అది మీకు తెలియకపోబట్టి ముందే నేను చేసిచూపిస్తు న్నాను. దేశంకోసం ఎంతరోషమేనా చంపుగోవాలి" అని జనానికి తెలియడానికి.

ఏజెంట్ల దగ్గిర్నుంచి వచ్చేటపా చూసినప్పుడు నాకు చాలా ఉషార్‌గానే ఉంటుంది. "ఈఊళ్లో మనపని మాంచి నిమ్మ కాయవాటంగా ఉంది. ఇక్కడమీకు వోట్లు దొంగలదోపిడిగా వర్షిస్తున్నాయి. సరిగ్గా లెఖ్క తేల్చుగునేసరికి నాకుతాడు తెగిపోతోంది. మందేవిజయం! కడమ అభ్యర్థులు గోలా ఏడు పూనూ! మన పెళపెళ వినేసరికి కొందరికి గుండెజబ్బూ, కొందరికి రక్తపోటూ పట్టుగున్నాయిట. మళ్లీ రాస్తాను" — "ఇక్కడ అంతా నమ్మకస్థులే. మీపేరు ఇక్కడ మంత్రంలా పనిచేస్తోంది. సొమ్ముపమ్మినా సరే జంకవద్దని తమరుఅన్నారు. దుమ్మైనాసరే అనినేను చిమ్మేస్తున్నాను. విజయం మనకేసే చూస్తోంది. ఈవేళ గాకపోతే రేపాయిరి మనదగ్గిరికి వచ్చి కాళ్లమీదపడుతుంది. మీరు కాళ్లురెడీగా ఉంచాలని హెచ్చ

రిస్తున్నాను" – "ఈఊళ్లో పెద్దల్ని దర్శించాను. మీరు నిలుస్తున్నారని వారు తెగసంతోషపడి ముందునన్ను ఊరేగించారు. వారందరూ మనిషికొక్క మరోమనిషికి ఒక్కవోటు కాదు వోటులో ఒక్కతోనేనా ఇవ్వంగాక ఇవ్వంఅని ఘోర ప్రతిజ్ఞలు వచనంలో చేశారు. కొందరు వద్దు మొర్రో అంటూన్నావినక పెద్ద పెద్ద ఒట్లుకూడా పెట్టుగున్నారు. మనం నెగ్గితీరతాం. నాశ్రమ తమరు మరవకండి" – "ఇక్కడ చాలామంది తమవోటుపత్రాలు పంపడంఖర్చు కలిసిరావడానికనే కాక ఆప్యాయంకొద్దీ కూడా నాచేతికిచ్చేశారు. మనం అనుకున్న వాటికంటె ఎక్కువే చేతికొచ్చాయి. చేతికి అందొచ్చిన సంతానంవాడికి విజయం దక్కక ఎక్కడికి పోతుంది?" – "ఈ ఊళ్లోమనం అంటే ఉండే ఉత్సాహానికి మేరలేదు. చాలామంది నిద్రాహారాలు విసర్జించాను. మనం మనజెండా పాతేశాం అన్నమాటే! కడంపోటీదార్లు గోడ్డుచ్చుగుని శంకరగిరి మన్యాలు అంటేశారన్నమాటే! మన దిగ్విజయం జరపడానికి ఏర్పాట్లు మీరు చేసెయ్యాలన్నమాటే! ఇప్పుడే చెయ్యండి, తరవాత సొమ్ముకి ఇబ్బందేమో!"

అయినా, పైకి పటాటోపంగా నేను మాట్లాడి వ్యవహరిస్తూ ఉంటోచ్చినా, హృదయంలో నాకు చచ్చేభయం వేస్తూంటుంది. పోటీదార్లల్లో కొందరిదగ్గిర నాజూకుతనం బొత్తిగాలేదు. రౌడీల్ని కూలికిపెట్టి ఎన్నికలకిగాని, అసలుగాని

నేనునిలవడానికి వీల్లేకుండా కాళ్లువిరగ్గొట్టేస్తారేమో అని నాకు ఒక్కరవ్వ భీతి లేకపోలేదు. కొందరు తుపాకులు తెప్పించి లైసెన్సు పొందారు. పోటీలోంచి తప్పుగోకపోతే నాయిల్లు నున్నగా దోపిస్తాం అని కొందరు ప్రైవేటులో చెప్పించారు. ఇల్లాంటివి నేను లక్ష్యపెట్టను. ఒకవేళ ఏదేనా గ్రహం వక్రించి మనం ఓడిపోతే ఏందారిరా భగవంతుడా అని భయం వేస్తూంటుంది. ఆమాట తల్చుగుంటే నో రెండి పోతుంది, గుండె కొట్టుగుని దూకడం మొదలెడుతుంది, శ్వాస ఆడదు. అయినా అదీ భరించవచ్చు. నాకంటె సర్వవిష యాలా పరమచపటలని దేశంలో ప్రసిద్ధిపొందిన మరో పోటీ దారు ఎవడైనా నెగ్గిపోతాడేమో అనే భయంనన్ను మరీ పీల్చి పిప్పిచేస్తోంది. ఆ సంగతి స్పృహలోకివస్తే నాగుండె ఆగేపోతుంది. అల్లాఆగిపోయినట్టు నామనస్సునాతో చెబు తూండడం నాకు స్పష్టంగా వినిపిస్తుంది, నాకు ప్రపంచం అంధకారం అనిపిస్తుంది, ఈ ఘోరాన్యాయం జరిగేటప్పుడు దేవుడనేవాడుంటే ఇతరపనులు మానుకుని రాడా అనిపిస్తుంది, ప్రజలు నన్ను గ్రహించలేక తమ అఖాతంలోంచి తేలినేలమీద పడి వృద్ధిపొందడం ఎంతకాలానికో గదా అనితోచి వాళ్ళకి రాబోయే దుస్థితి స్ఫురించి, నాకు చాలా హడలువేస్తుంది. కాని నేను ఎంజెయ్యను? నాచేతులోపనా ఏమన్నానా? జనానికి దురవస్థ రానీకుండా కాయడంకోసం నేను నెగ్గడానికి యత్నిస్తూంటే వాళ్లు కలిసిరాకపోతే వాళ్లకి అంతేశాస్తి!

వాళ్ళ సిద్ధాన్నంవాళ్లే తన్నుకుంటున్నారు? ఎవరు భయపడి ఏంలాభం!

సరే, జనాన్ని అల్లా అపహారించనీండి, వాళ్ళకే తెలుస్తుంది అనుభవించిన తరువాత! ఈపోటీవాళ్ళల్లో ఎంతెంత నీచత్వానికి దిగేవాళ్లున్నారని తమఊహ! కడంవాళ్ళంతా నాఅంత ఘామేదాగా పోటీ చెయ్యకపోతారా అనుకోడం పామరత్వం. రామరామ, నాపోలిక వాళ్ళకొస్తే ఇహానేం కావాలండీ! అసహ్యాం వేస్తుందండీ బాబూ, వోర్తిఅధములండీ! అధమాధముడిదగ్గిర వోటుంటేవాడికి గ్లాసు అందివ్వడం, వాణ్ణిశృంగారించడం — ఛీ, దిక్కుమాలినపన్లు! ఒకడుసైడుకాలవలో స్పృహలేకుండా పడుకునిఉంటే వాడివోటులాగి కడిగేసి పట్టిగెళ్లాడు ఒక పోటీదారు! అంతకంటే అసహ్యాం ఉంటుందా? ఒకపోటీదారు వోటరింటిమీద కళ్మలంవేయించి, వోటులాగి క్షమించి అంతటితో వాణ్ణి వొదిలిపెట్టాడు. ఎంత రోతో గమనించండి. ఎదీ నే చెయించానేమో చూడండి అల్లాంటిపన్లూ! చెయించలేకే! చెయిస్తే ఆగుతారూ వీళ్లూ! పోనీ, నాజాతకంగ్రహించి ఆయుర్దాయం గురించి ఒకపోటీదారు వాకబులోఉన్నాట్ట ఆపని ఎంత హేయంచూడండి. నాయేజెంటు రైంయ్యిమనికార్లో పోతూంటే ఒకపోటీదారు తనకార్లో ఎదురై మాకార్ని పిల్లిమంత్రాలు వెయించి మాయేజంటు రక్త ప్రవాహాలై స్మారకం తప్పి పడిపోగా, హిహిహి అని నవ్వేతాట్ట! వాడిమనస్సుయొక్క రకం తల్చుగుంటే పేగులు

బద్ధులై పైకొస్తాయో రావో చూడండి. రాత్రివేళ ఒక పోటీదారు వెళ్లి కొందర్ని తనపక్షం తిప్పుగుందాం అని ప్రయత్నించేటప్పుడు ఒక శత్రుపక్షంవాడెళ్లి వాడిమీద ఓగొంగళీ గిరవాటేసి కట్టేసి తీసిగెళ్లి కాష్టాల్లో పడుకోబెట్టాడట, ఎమికలు గుచ్చుకుని నిద్రాభంగం అవుతుందనేనా చూడకుండా. అది ఎంత పాశవమో గమనించండి! సరి, ఒక పోటీదారు సుగవోట్లనిమిత్తం ఆడఏజెంట్లని నియమించాడట, ఏకాడికొచ్చిందో చిత్తగించండి! అబ్బే, తల్చుగుంటే డోకొస్తుందండీ!

మళ్లీ నాహంగుదార్లలో ఒక్కొక్కడే వచ్చి జరిగిన సంగతుల గురించి చెబుతూంటే ఆశ్చర్యం వేసిపోతుంది. ఒకాయన సుస్తీలోఉంటూ నాఅభ్యర్థిత్వం విని, టపీమని లేచి కూచుని, ఆనందించి ఆసుస్తీనోటే అనుకోండి, మూటకట్టి పదిలంగా మాహంగుదారు చేతుల్లోఉంచాట్ట! ఎంతచిత్రమో చూడండి! కొందరు పెద్దచదువులు చదువుకున్నవాళ్లు "నావోటు మీదే. తిరగక్కర్లేదు, కడంవి చూసుగోండి, నావోటు మీకోసం మీదుకట్టేశాను" అంటూ తమ దగ్గిర కొచ్చిన ప్రతీవాడితోటీ అని, కాళ్లరిగేటట్టు తిరిగిన వాళ్లల్లో ఎవడికీ తమవోటురాల్చక మూలకూచున్న మూగాడికెవరికో వేశారట, ఎంతవిరుద్ధమో చూడండి! ఒక వోటరు నాహంగుదార్ని ఆహ్వానించి తీసిగెళ్లి భోయినంపెట్టి సత్కరించి వోటిచ్చుగుని పంపేశాడట! అల్లాంటి విపరీతపు

మనుష్యులు ఇటువంటికాలంలోకూడా ఉండడ మనేది అపూర్వ విషయం. ఓ వోటరు నాహంగుదారుఎదట నన్ను తెగ తిట్టి (వాడు నావాడని ఎరక్క) తరవాత వాడు నావాడే అని తెలుసుగుని నొచ్చుగుని, ఆ సంగతి నాతో చెప్పద్దని బతి మాలుకుంటూ లంచంగా తనవోటు మాకు. పారేశాట్ట! వెధవతిట్లుతింటే తిన్నాంగాని క్రూరమైన వోటుని వశం చేసుగున్నాం అదే చాలు లేస్తురూ అన్నాడు నాహంగు దారు! ఒక వోటరు దంపతుల్లో ముగుడు తనపెళ్లాం తను అన్న ప్రకారం వోటుచెయ్యననడంవల్ల విడాకులకోసం యత్నిం చడం, విడాకుల ఖరీదు మరీజాస్తీ అవడంవల్ల అతడు తమల పాకులే కొనేసుగుని ఇంటికిరావడం జరిగిందట! ఎంత యిదిగా వస్తోందో చూస్కోండి! ఏదేనా నియమాన్ని ఒక అభ్యర్థి స్వవిషయంకోసం భగ్నంచేస్తూ ఆనియమాన్నే మరో అభ్యర్థి పాటించకపోడంలో నేరంచేశాడని ప్రచారం చేసుగో వలిసొచ్చే ఎన్నికలకి జనం ఎందుకయ్యా ఎగడతారూ అంటే ఫలానాఅని తెలియనక్కర్లేకపోడంవల్లే! ఇది అద్భుతమే మరీ!

ఆ దీక్షాదినాల్లో తప్ప నేను, తరవాత, మాట చాలా తగ్గించేశాను. మౌనం వహించాననన్నా తప్పులేదు. ఫలితం ఇటవుతుందా అటవుతుందా అంటూ నేను గుణకారాలు వెయ్యనే లేదు. అయిపోయిం దేదో అయిపోయింది, దాన్ని గురించి బాధపడడం మానుకున్నాను. తిరగడంలో రోడ్డు బాడి పడి, గుడ్డలు ఎర్రపడ్డప్పణ్ణించీ కాషాయిబట్టలమీాది

కళ్ళింది మనస్సు, అవి ధరించేవాణ్ణి. దొడ్లో చెట్టుకింద స్థలం బాగుచేయించి, రోజూ సాయంత్రం అక్కడ ఒక ఆసనం వేయించి దానిమీద కూచోడం ప్రారంభించాను. శూన్యభావంతో కూచోడంకంటె ఏదైనా నిర్మలభావంతో కూచుని తదేకంగా స్మరించడం మంచిదని నాకు తోచింది. సద్యఃఫలితం లేకపోయినా ఉపాసనవల్లా, పునశ్చరణవల్లా ఫలం ఉండితీరుతుంది గనక మరోమంత్రం మరోమంత్రం అయితే అధికార అన్వయ ఆచరణల్లో తేడా లొచ్చి బెడిసి కొట్టి తుడిచేస్తుందేమో అనే భయం చొప్పున, వోటేమంత్రం అనుకుని యథాశక్తి జపం నిష్కామంగా సాగించాను. నామనస్సు ప్రశాంతం అయిపోయింది. నెగ్గినా నెగ్గకపోయినా నాకు సమానమే అనిపించింది. ఓడిపోయినా నామనస్సు ఎంతమాత్రమూ బేజారుపడదు చూస్కోండి అని జనానికి దాఖలా యివ్వడానికి నేను ఓడిపోయినా బాగుండును అని పించింది. నేను తీరా నెగ్గేస్తానేమో గదా అని భయం వెయ్యడం మొదలెట్టింది. అల్లాంటి భయాన్నికూడా పార దోలాను. చివరికి అనుకున్న మోస్తరుగానే జరిగింది. ఒక సన్మరంతి అభ్యర్థి విజయం పొందాడన్నారు. ధర్మానికి రోజులు కావనుకుని నేను సమర్థించుకున్నాను.

* * * *

వోటరు వోటివ్వడానికి కారణాలు అప్రత్యక్షంగా ఉండే రకంవి వోటర్లువల్లే తెలుస్తూంటాయి. అనేకసందర్భాల్లో

అనేకులు చెప్పగా వినబడ్డ కారణాలు కొన్ని యీక్రింద ఉన్నాయి: నాజ్ఞాతి లగాయతు రాష్ట్రాంతరవాసివరకూ ఉండే జనంలో బాంధవ్యంయొక్క చేరుపునిబట్టి ఇచ్చాను — వాడు చాలా చేశాడు — అతఁడు గట్టివాఁడు — లక్ష కోశాడు మరి, చేసి చేస్తూండి చెయ్యబొయ్యేవాటిని గురించి ఉత్తరంరాశాడు — నాకు స్వంతదస్తూరీలో రాశాడు — పాపం నాయింటికొచ్చి నన్ను చూశాడు — నన్నొచ్చి చూసిన వాళ్ళల్లో మొదటివాడు — నన్ను బతిమాలుకున్నాడు — నా కాళ్ళట్టుగున్నాడు — వోటిస్తేగాని అభోజనం పడుకుంటా నన్నాడు — నాకడుపున పుడతా నన్నాడు — తన పిల్లాడికి నాపేరు పెడతా నన్నాడు — నన్ను చంపుగుతిన్నాడు — అనేకులద్వారా నన్ను ఊదరకొట్టి వేపించేశాడు — నాదగ్గర కొచ్చి కాకిగోల — నేను ఆయన్ని ఎరగనుగాని మావాడు రాశాడు — ఆయన మాఅల్లుడిచేతే రాయించాడు — మా అధికారి దగ్గిర్నించి ఆజ్ఞాపత్రం వచ్చింది. గనక నేను ఫలనావారికి వోటు చెయ్యకపోతే నాఉద్యోగం కాస్తా ఊరేగిపోయి చిప్ప చేతి కొస్తుంది, ఫరవాలేదని ఇప్పుడు సలహా ఇచ్చేవాళ్లు తర వాత కనిపించరు — నేను ఒకాయనికి (ఆయన పేరెవరో మరచిపోయాను !) తీరా వాగ్దానం ఇచ్చానండి, ఇప్పుడు మాట తిరిగి పోతే బాగుంటుందా చెప్పండి, 'తిరుగన్నేరదు నాదుజిహ్వ' అన్నాడు తెలుగుబలి, (అనగా తను సాధారణంగా అన్నమాటప్రకారం పోయే మనిషనిన్నీ, అధమం

వోట్లసందర్భంలోనేనా అన్నమాట జరపగల అపర హరి శ్చంద్రుడు తనే అనిన్నీ, కలియుగంలో సత్యహరిశ్చంద్రుడు లేని లోటు ఏకొంతవరకేనా తాను తొలగించాలని అనుకుంటూన్న సంగతి జనానికి తెలియాలనిన్నీ చాలామంది అభిలాష.) ఆయన మెల్లానూ నెగ్గుతాడు, అందుకని ఇష్టం లేకపోయినా ఇచ్చాను. — ఆయన మెల్లానూ నెగ్గడు, అందుకని వోటు వట్టుగు పొమ్మన్నాను — ఆయన మాంచిప్రతిభగలవాడు, అందు కనిఇచ్చాను — ఆయన పాపం శుద్ధ తెలివితక్కువఘటం, అందు కనే పోనీ ఏం శాశ్వతం, తెగ ముచ్చటపడుతున్నాడు, అదీ చూద్దాం, భాగ్యమా ఏమిటి, నేను మానేస్తే ఇతని మందలో చేరేదెవడూ అని ఇచ్చాను — నేను 'నావోటు ఏం జేసుగోనూ, నాకు పనికిరాదామె' అని ఆలోచిస్తూ ఒక్షణ్ణే మంచం నేను గుంటూరంటే ఓఅభ్యర్థి వచ్చి సాయం చేసిపెట్టాడు. తక్షణం, అడక్కుండానే అతడికి నావోటు ఇచ్చేశాను — నాకు అభ్యర్థులందరూ మొహమాటీలే అవడం చేత మనికి ఈవోటుప్రాబుద్ధం ఎక్కడొచ్చిపడిందిరా క్షేమంగా కూర్చోంకుండానూ, పోనీ యీవోటుని సమత్వ సిద్ధాంత ప్రకారం అర్థించేవాళ్లందరికీ ముందే సమభాగాలుగా పంచ డానికి వీల్లేదాయిరి, అని వారంరోజులు తెముల్చుగోలేక బాధ పడి, ప్రతీవాడితోటీ వాడికే వోటిచ్చానని ప్రమాణ పూర్తిగా కోసేసి చివరకి కళ్ళుమూసుగుని వేసేసి పంపించాను — ఇల్లాంటి బాధ పడలేకే నేను కాగితం అక్కరకిరాకుండా

అంకెలు వేసేసి ఊడిరాకుండా జిగురెట్టి అంటించేసి ఎవరో వచ్చి స్తోత్రం చెయ్యగా వారికే వేశానని ఇచ్చేశాను – నేను ఎవర్నీ ఎరగను, అంతకని ముందే సంతకంచేసేసి, ఎవ రేనా అడిగితే పారెయ్యమని నాస్నేహితు డొకడికి పంపేసి సుహాంగా నిద్దరోయాను. — ఈరీతిగా ఉంటాయి. ఇవి చూస్తే వోటు ఒకరికి ఇవ్వడానికి ఏకారణం అయితే ఉందో అదే ఇవ్వకపోడానికికూడా కారణం అన్నమాట. అసలు వోటు ఇవ్వడాన్ని గురించి కారణం గమనించడమే తప్పు. వోటంటే ఇష్టంగదామరీ! నాయిష్టం అనే స్థితివచ్చినప్పుడు కారణం చెప్పడంకంటె అడగడమే తప్పు. అందుకనే ఒక జ్ఞాని “వెయ్యిపానులు దానం చెయ్యడం తేలికగాని, తనకున్న ఒకవోటు సార్థకంగా ఇచ్చి పని జరిగేటట్టు చెయ్యడం చాల కష్టం” అన్నాడు. వ్యక్తియొక్క వోటు హృదయపూర్వ కంగా జరగాలీ అంటే విద్యాధికులలోనే ఎక్కడలేని మూర్ఖా ముళ్లూ బయల్దేరుతాయిగదా, తక్కినవాళ్లల్లో ఇష్టాల్ని బట్టి విజయాలుంటాయా అని కొందరు అనుమానిస్తారు. కాని, అక్కడే నాటకభాగం తక్కువ ఉంటుందని కొందరుఊహిస్తారు.

---

# రేడియో-కబుర్లు

(i)

నాదప్రసరణానికి భూ—జల—వాయ్వాకాశాలు తోడవుతాయి. ముఖ్యంగా మానవులుండేది గాలిలోనేగనక వాయువు నాద వాహకంగా ఉంటుందనేమాట మానవులు గమనిస్తూండే విషయమే. పోనీ వాయువేగం వేరూ, వాయువులో నాదవేగం వేరూ అయినా, జనించిన ఒక నాదతరంగాన్ని వాయువు తన ప్రకంపనశక్తివల్ల మోసెయ్యగల దనేమాట రూఢి. అది అట్లా మోసెయ్యకలదేగాని, విశేషదూరం గడవకుండానే నాదంయొక్క పటుత్వం క్షీణించి త్వరలో ఆనాదమే అంతరించి పోతుంది. (నాదానికి అల్లా క్షీణించేలక్షణమేగనక లేకపోతే భూగోళం ఎల్లప్పుడూ గందరగోళంగా ఉండవలసొచ్చేది గనక మనం విచారపడనక్కర్లేదు!) ఒకవేళ; అల్లా అంతరించ కుండా నిలవగల సామర్థ్యం నాదానికి ప్రసాదించాం అనుకోండి. అనుకున్నా, భూమికి సగంచుట్టు తిరిగిరావడానికి నాదానికి ఒకపూటా అందుపైన నాలుగుగంటలూ కూడా ఇంకా చాలనే చాలదు. భూగోళంమీద ఉండే ఏయిద్దరి మనుష్యులకైనా మిక్కిలి— ఎక్కువదూరం (భూమియొక్క అర్ధపరిధి గనక) పద మూడువేలమైళ్ళు మించదు. అటువంటి యిద్దరిలో ఒకడు మాట్లాడితే రెండోవాడికి వినపడడం నాదబలానికి అతీతం గనక అసంభవంఅని మానవులు నమ్మేవారు. కాని మానవుల విజ్ఞా

నమూ, ఆలోచనా, కార్యాచరణా, జీవితావసరాలూ పెరిగిన కొద్దీ, ఎవరో ఒకజ్ఞాని మరోపన్లోఉండి ఒక విద్యుద్దీపప్రయోగంలో గావించిన ఊహానుమాన బీజంవల్ల 'రేడియో' అనే సంస్థ ఆవిర్భవించినమీదట, అసంభవం అని లోగడ అనుకున్న పని, సంభవంఅయినా పూటకాలంలోకుడా కాదనుకున్న పని, సెకనుయొక్క ఒక వీసభాగంలో జరిగిపోతూండడం విశేషనాగరికత లేనివాళ్లకి కూడా పరిపాటి అయినసంగతి. అనగా రేడియో వచ్చి, వాయుదేవుడు వేగవిషయంలో ఎంత పేరుపడ్డప్పటికీ ఆ "మంద" పవనం గార్ని నాదవాహక క్రియ లోంచి కొన్నిసందర్భాల్లో తొలగించి, ఆపని తనుచేసి, దూరాన్ని జయించేసి, దూరశ్రవణం సుసాధ్యం చేసింది. ఇక ప్రేషకస్థానంలో నాదోచ్చారణ చెయ్యగానే ఉద్భవించే నాద తరంగం, దాన్ని అనుసరించి సూక్ష్మాతిసూక్ష్మాలతో శబ్ద గ్రాహిలో బయల్దేరే విద్యుత్తరంగం, దాన్నిబట్టి ఉండే ప్రవర్ధక తరంగం, అది పరివర్తనకోశంలో పడ్డ మీదట పుట్టే క్రమణిక తరంగం, తద్వారా ప్రకంపనతరంగం, సాధారణసాతత్యం లోంచి మహాసాతత్యంపొందిన ప్రవాహకతరంగం, దాన్నుంచి కాంతవిద్యుత్తరంగం, తత్ప్రసరణం, పైక్రియలన్నీ విలోమంగా నడవడానికి ఏర్పాట్లుచేసుగుని గ్రాహకాన్ని అదే స్మృతిలో మేళగించి జనంకూచున్న ప్రతీస్థలంలోనూ అసలునాదం యథా రీతిగా సిద్ధించి సెకనుయొక్క వీసభాగంకంటె తక్కువలో విన పడడం - అనేటటువంటి తికమకలు 'రేడియో' అనేది తన నిత్య

కృత్యంలో పడేపాట్లు! అన్నట్టుప్రేషకస్థానంలో ఉండేనాదచోద కులు కూడా అటువంటిపాట్లు పడతారు. తక్కినవాళ్ళు ఫలితం వినడానికి చెవికోసుగుంటారుగాని, అటువంటివాటిని చెవినిపెట్టరు.

(ii)

'రేడియో' లో విశేషాలు ఏమిటంటే వినపడేదూరం పొడుగునా కాస్తతీగేనా లేకపోడం ఒకటీనూ, నాదం భూమి అంతటా సెకనుయొక్క భాగంలోనే చుట్టబెట్టి వినిపించడమూనూ! ఇతరగ్రహాలదగ్గిరికి భూమినాదం ఈయంత్రంవల్ల వినిపించదని చెబుతారు. వెళ్ళి తిరిగొచ్చినవాళ్ళు చెప్పేవరకూ అది ఒప్పుగున్నా తప్పు లేదు. మనిషియొక్క దేశాభిమానం భూగోళాభిమానంగా మారడానికి అవకాశాలు రేడియోలో ఉన్నాయి. పరభాషలు వినేటప్పుడు అవి కూతలులా ఉన్నాయనీ, పర గానాలు వినేటప్పుడు అవి ఒకటోరకం ఏడుపులులా ఉన్నాయనీ జనం అనవసరనిరసనం చెయ్యడంపోయి ఆయానాదాలు వాళ్ళ వాళ్ళకి శ్రావణయోగ్యంగాఉండే కవిత్వ గానాలుగావును అని సరిపుచ్చుకోగలగడమే గొప్పసహానశక్తి గనక అది రేడియోవల్ల అభివృద్ధి అవుతుందని చెప్పవచ్చు. భాషే కాక, గానమే కాక, ఇతర నాదలేశ సముదాయం కూడా హృదయాన్ని ఆకర్షించి అర్థదాయకం కూడా కావచ్చునని రేడియోలో తెలుస్తుంది. చదవడంలోనూ వ్రాయడంలోనూ అవసరంఅయే శ్రమగాని, శ్రద్ధగాని, దీక్షగాని లేకుండానే —

ఆమాటకొస్తే అసలు చదవడం రాయడం తెలియవలసిన అవసరం లేకుండానే, ఏకకాలమందే అనేకమానవుల్ని జ్ఞానవంతుల్నిగా చెయ్యడానికి రేడియోకి సామర్థ్యం ఉంది. శారీరక మానసిక ఆత్మికసందర్భాల్లో మానవజాతికి అవసరం, అనుగుణం, అనుకూలం, ఆనందంగల ఏవిషయం అయినాసరే అరటిపండు ఒలిచినట్టు వినిపించగల ప్రజ్ఞ రేడియోదే, రేడియో నిమిత్తంఅయే సొమ్ముఖర్చూ కాలవ్యయమూ గమనించి అందుకు తగ్గట్టుగా ఎంతమంది పామరజనం అజ్ఞాననిద్రలోంచి మేల్కొల్పబడ్డారు, వాళ్ళవిజ్ఞానప్రమట్టం ఎన్ని అంగుళాలు పైకిఎగిరిందీ అనేలెఖ్ఖలు ఎప్పటికప్పుడు తేల్చడానికి వీలైన రకంవి కావు. అసలు పామరజనం రేడియో లాభం పూర్తిగా పొందగలరా అనేదే మీమాంస. ఎందులోనైనా సరే గొప్పవాడొచ్చిమాట ఆడినా, గానశాస్త్రి వచ్చి పట్టుపట్టినా, రొదచేసినా, జనం వినడానికి గ్రాహకపు పెట్టెలున్న చోట్లకి ఎగడతారు. రేడియోలో మాట్లాడింతరవాతగాని, పాడింతరవాతగాని గొప్పవాళ్ళైన వ్యక్తులుకూడా వెతికితే విధిగా దొరికితీరతారు. మధ్యరంగంవాళ్ళకి రేడియో వినడం మంచివ్యసనం. నస్యం, కాఫీ — పీల్చడపువ్యసనంలాగే, టాకీచూడడపు (తెలుగుదైతేవినడపు) వ్యసనంలాగే, వార్తాపత్రికలు చదవడపు (డబ్బుఖర్చుతనదికాకుండా ఉండేమరతుకి) వ్యసనంలాగే, ఈవ్యసనమూనూ! అందుకని ప్రేమకభవనంలో గంటలప్రకారం—కాదు! సెకనులప్రకారం—కొందరు

పనిచెయ్యాలి, అల్లానే లక్షలాదిజనం, ఇతరపని (అగ్నిహో త్రాలు చెయడంవంటివితప్ప) మానుకుని గ్రాహకయంత్రాల చుట్టూ మూగాలి. రేడియోవినడం నుంచినిషా అనికూడా కొందరుఅంటారు. కొన్ని ఇతరనిషాలలో పడిఉంటూండే సమయాల్లో ఎవడైనా తనదుఃఖాలు హాయిగా మరిచిపోగ లగడమేకాకుండా తనఇష్టంలేకుండా తననే మరచిపోవాలి, కాని, ఇందులో అంతమట్టుకు రాదు. ఎటొచ్చీ, విని విని విని ఏమివిన్నావు అని ఎవరేనా అడిగినప్పుడు, అన్నీ కొట్టుకు పోయాయి ఫలితం సున్న అనిగాని, ఓదాన్ని ఓదాంతో కొట్టెయ్యగా ఒక్కటే ఫలితం, అది నేనే అనిగాని చెప్పటానికి చాలా అవకాశం ఉంది. జనానికి ఆదిలో శబ్దమే ప్రమాణం. మధ్యకాలంలో గ్రంథప్రమాణం కావలసొచ్చింది, కాని మళ్ళీ ఇప్పుడు శబ్దప్రమాణంలో పడేటట్టు కనిపిస్తారు. రేడియో అనేది పత్రికలపాలిట ఇటీవల పుట్టిన దుడుకుసవితి. అయినా "చేత"అనగల పత్రికలుకూడా "వాత"అనగల రేడియో దగ్గిర నోరెత్తలేవు. కనబడి వినబడే నాటకలోకంయొక్క వినబడే సగం చెక్కనీ రేడియో స్వాధీనపరుచుకుంది. రాబోయే టెలివిజన్, ఆ తక్కిన కనబడేసగంచెక్కనీ దఖలుపరుచుకో బోతోంది. చెలరేగుతూన్నటాకీ యావత్తునాటకాన్నీ బొమ్మకట్టి మింగేసేయత్నంలో ఉండనేఉంది.

(iii)

రేడియో వినిపిస్తూ పనిచెయిస్తే కూలివాళ్ళు ఎక్కువ పని

చెయ్యగలుగుతున్నారని తెలుస్తుంది.

రేడియో సెట్టు వీపుమీద పెట్టి ఆవుల్ని పాలుపితికితే మామూలుకంటె ఎక్కువగా పాలిస్తున్నాయని కనిపెట్టారు. అట్లాకాక, మామూలులో తన్నేరకంవి ఇటువంటప్పుడు ముందుకుమ్మేసి ఆవెనక తన్నేసినా ఉభయత్రాకూడా రేడియో సెట్టుకి ప్రమాదం ఉండదనిరూఢిగా చెబుతున్నారు.

రేడియో శక్తి బలాన్నిబట్టి చెట్లని కోరినసైజులో పెంచుతున్నారు.

రేడియోవల్ల కుదర్చగల రోగాలకంటె వచ్చేరోగాలు చాలాతక్కువే అనేసంగతి పరిశోధనవల్ల తేల్చారు.

ఒకవ్యక్తి ఏదోయంత్రం కేసిచూస్తూ, కనిపించని జనశతాల్ని గురించి, వారిమెప్పువగైరాలు తనకు అందే చిక్కులేకుండా, హృదయం విప్పి హృదయంగమంగా నాదంచెయ్యడం ఒక గొప్ప కళ అని ఒకమహావాదంలో ఒకపార్టీ దెబ్బలాడగా, అది కళ కాదు కేవల ద్రుతప్రకృతికమే అని ఇంకోపార్టీ ప్రతిఘటించారు.

జనంఎదట ప్రత్యక్షంగా నిలవబడి నెగ్గలేనివ్యక్తికూడా రేడియోలోంచి ఉపన్యాసవాచికంగాని గానంగాని చేసేటప్పుడు వినేజనం తమ ఇష్టాయిష్టాల్నిబట్టి గోలచేసినా, గొల్లుమన్నా, తనుమాత్రం మానక్కర్లేదు, సయించకపోతే జనమే మానుకోవాలి.

ఒకళ్లని వారి పక్కింటివాళ్లు తిట్టేటప్పుడు, ఈ కాలంలో ఆ ఒకళ్లు మళ్ళీ తిట్టనక్కర్లేదు. తమరి రేడియోసెట్టు విప్పి

ఆ క్షణంలో దొరికే పరదేశపు బ్యాండులాంటిది పెట్టేసి తప్పుకుంటేసరి, అవతలవాళ్ళతిట్లు టక్కున కట్టిపోతాయి.

ఒకవేళ పక్కింటివాళ్ళు కోపధారిబాపత్తై, వీళ్లు విరామం లేకుండా రేడియో వెయ్యడంవల్ల తమరు కోపంలో మరీ రెచ్చిపోయి, వీళ్లని సరసం చాలించండని కోరారా, వీళ్లు గంటకి రూపాయిలాంటి రేటు మాట్లాడుకుని, ఇచ్చిన డబ్బుని బట్టి ఎన్నిగంటలో లెఖ్ఖ వేయించి అంతసేపూ ఆపడానికి తెగించవచ్చు.

రేడియో నాటకాల్లో నటులు కాగితాలకేసి చూస్తూ నాటకాన్ని పెదవుల్తో గిరవటెయ్యడానికి వీలుంది. మామూలుగా జీవించే నటులు వచ్చినముక్కలు ఎల్లాచెప్పాలీ అని బాధపడితే రేడియోనటులు ఏమి ముక్కలా చెప్పడం అని ఆడేటప్పుడే కళ్లతో తడుముకో వలసిన అవసరాలు కలగచ్చు.

రేడియోపక్ష కార్యక్రమం తెలుగులో అచ్చుకొట్టగా అది ఆంధ్రులికి అవసరంలేకపోయింది గనక, ఇతరభాషలవాళ్లకి మూడు నాలుగేసి రేడియోస్టేషన్లు పడ్డతరువాత, ఏకంగా మహాంధ్రా రేడియోస్టేషన్ పురమాయిస్తారు అని గ్రహించుకుని, అది తీరా కట్టొచ్చేసరికి, ఏ ఊళ్లోనూ లేక ఏ ఊరు సమీపంలోనూ అని యథాప్రకారం మళ్ళీ దెబ్బలాట రావచ్చును గనక, ఆపనిమీద ఇప్పణ్ణించీ ఆంధ్రులంతా నడుంకట్టి నిద్రపోతారని వినపడుతుంది.

రేడియోపాలకులకి జా॥ దగ్గిర్నించివెళ్ళే ఉత్తరాలసంఖ్యని

బట్టి రేడియోలో మాటకిగాని పాటకిగాని ఆహ్వాన పున రాహ్వానాలు ఉండవచ్చునని అంటారు. ఒక్కొక్కపాటో మాటో అయింతరవాత, దాన్ని జనం ఎల్లాభరించినా, అది అద్భుతంగా ఉండేసినట్టు పైవారికి ఉత్తరాలు కురవాలిట, కురుస్తూంటాయి. అసలు అవి వేర్వేరుగాడున్నా ఫరవాలేదు. ఉంటూండవు. వేర్వేరు ఊళ్ళనించివెళ్లినా మతలబుఒకటే అవడం చిత్రం. ఒక్కొక్కప్పుడు ఆఉత్తరాలురాసేవాళ్ళు అందరూ ఒకేరీతిగా పొరపాటుపడతారో గ్రహపాటో, దిక్కుమాలికర్మం, ఆ అసలుగాయకుడుగాని "మాటకుడు" గాని పిల్లేక నియమించినప్రకారం వెళ్లి పాటగాని మాటగాని ఆడి ఉండకపోయినా, ఆ జరగని కార్యక్రమం అద్భుతంగా జరిగిపోగా తమరు వినేశాం అని ఉత్తరాలు దిమ్మరిస్తూంటారు. ఉత్త రాలవల్ల ఏం నిర్ణయం అవుతుందయ్యా అంటే లిఖితసాక్ష్యం గదా! శబ్దం చేసే రేడియోకి శబ్దసాక్ష్యం పనికిరాకపోడంలో ఆశ్చర్యంలేదు.

రేడియోస్టేషన్ పాలకులచర్య వాళ్ళపుణ్యంచొప్పున మహానిరంకుశం! అనగా మరేంలేదు. వాళ్లే అనాలి, జనం వినాలి. కుంయికంయి మనకూడదు, అనలేరు. మొరలు వినిపించవ్, రచనలు పత్రికలకి పంపితే, వారికీ వారికీ ఏవేనా భేటీలురావచ్చు చూడండీ! అంచేత ఆ రచనల్లో కొన్ని కొన్ని ఆవాక్యాల దగ్గిరికొచ్చేసరికి సిరా మంచిరకంది కాకపోడంవల్ల ఆవాక్యాలు కాగితానికి అంటుకోవు. కాని నిరంకుశత్వానికి

కాలం వుంది. "హర్ హిట్లర్" ని మొట్టికాయవేసే పైవాడు "హిజ్ హిట్లరు" ఉండితీరతాడు – అని మా డాక్టర్ ప్రెసిడెంటు ఒకసారి "డిన్నర్" మధ్యలో సెలవిచ్చారు. అమెరికాలోని ఎలక్ట్రిక్ ఇంజనీరు - డాక్టరు నీల్ మోరే హాప్కిన్స్ అనే ఆయన ఒక చిన్నయంత్రం కనిపెట్టాడట. అది త్వరలోనే అమ్మకానికి వస్తుందట. అది ప్రతీ రేడియో సెట్టుకీ పెట్టవచ్చుట. దాన్లో ఎవరు మాట్లాడినా తక్షణం ఆమాట భేష్ అన్నా సరే స్టాఫ్ అన్నా సరే రేడియో చోదకస్థానంలో వినిపిస్తుందిట. అప్పుడు అన్ని గ్రాహక రేడియోల వాళ్ళుకూడా తమ ఆనంద విచారాలు ఒకేసారి వెళ్ళిబుచ్చి రాట్టాయినా ప్రేషక రేడియో స్టేషన్లో పనిచెయ్యడంగాని, దానికి సమీపంలో ఉండడంగాని కొంచెం ఇబ్బందిగానే ఉండవచ్చుట. కాని ఒక మంచిలాభం ఉంటుందన్నారు. రేడియో సెట్లు ఎంతమందికొన్నారో అంత మందీగనక మెచ్చుడమో తిట్టడమో కానిచ్చేసరికి, సెట్లు ఎన్ని అనే లెఖ్ఖ జనాభా లెఖ్ఖకంటె ఖంజాయింపుగానూ త్వరగానూ తెలిసిపోవచ్చుట !

రాత్రివేళ కొన్ని రేడియోసెట్లలోంచి వచ్చేమాటలు కంపు కొడుతున్నాయని అంటారుగాని, మనం ఈకాలంలో అల్లాంటి మాటలు నమ్మకూడదు.

వినేజనం తనుకు తెలియంది గంటసేపు భరించగలరుగాని తెలిసేది పావుగంట భరించలేరు. సంగీతంలో మాటలకి అర్థాలు స్ఫురించకపోయినా తెలిసినట్టు అనుకోవాలి, రాగాలకి అర్థాలు

అడగకూడదు. ఇక, పదరచనలో మాటలకి అర్థాలు తెలియాలి, లేకపోతే ఉచ్చారణే అడ్డిపోతుంది. అర్థజ్ఞానంలేని రచనల్లో ఆనందం అనుక్షణం కలిగించవచ్చుగాని, తెలిసే మాటల్లో అనేకులకి ఒకడు చెయ్యగల మహోపదేశం ఈ రోజుల్లో రోజూ ఎక్కణ్ణించి వస్తుంది కొత్తది! అందుకని, రేడియోకవిత్వంవిలవ రేడియోగానం విలవలో దశాంశం కూడా ఉండదు.

జేబులోకి సరిపోయే రేడియోసెట్లు పాతికేసిరూపాయలకి వస్తాయని చెప్పుకుంటూండడంవల్ల, సగంశేట్లు అయింతరవాత సినీమాకి వెళ్లినట్టు, అప్పుడు మనంకూడా ఓసెట్టు కొనుక్కో-లేకపోతామా అని అస్మదాదులు లోపల లోపల కుట్రలు పన్నుతున్నారు.

జేబురేడియో అయింతరవాత చెవలరేడియో బయల్దేరుతుందని ఇంకా మరికొందరు చెవులు నిక్క-పొడుచుగుని ఉన్నారు. వాళ్లు అనుకునేసెట్టు అయిదురూపాయిలే. చివరకి ఎల్లానూ వినవలసింది చెవేగనక ఆసెట్టు చెవికే తగిలించెయ్యొచ్చు, కుండనాలూ తమ్మెట్లూలాగ! ఒకచెవికే అయితే అసహ్యంగా ఉండవచ్చు గనక, రెండుచెవలకీ – ఒకటి స్వదేశవార్తలకీ రెండోది విదేశ కార్యక్రమాలకీ, అని పెట్టుగుంటే బాగుంటుందని చెబుతున్నారు. ఒకవేళ, వాటి బరువువల్ల చెవులు దీర్ఘంఅయినా ప్రస్తుతం స్వర్ణకర్ణాభరణాలు ధరించేవాళ్ల చెవలకంటె ఎక్కువ దీర్ఘం కావనిన్నీ, అసలు దీర్ఘశ్రవత్వం క్రమేపీ వృద్ధశ్రవత్వంలో

పడి మిక్కిలి వైభవంగా ఉండబోతుందనిన్నీ కొందరు అభయం ఇస్తున్నారు.

ఒకవేళ, టెలివిజన్ కూడా ఈలోపులోనే ప్రచారంలోకి వస్తే తక్షణమే—అనగా ఇంటిటెలివిజన్ సెట్లూ, జేబుటెలివిజన్ సెట్లూ, కంటిటెలివిజన్ సెట్లూ, అంటూ కూచుని కాలంపాడు చేసి పారెయ్యకుండా, మొదట్లోనే కళ్లసెట్లు ప్రచారంలోకి తెచ్చేస్తారని చాలా నమ్మకంగా అంటున్నారు. ఇదివరకే మామూలు కళ్లజోడు ధరిస్తూన్నవాళ్ల విషయంలో అర్ధ చంద్రాకారంలో అద్దాలు కేటాయించి, పైఅద్దాలలోంచి చూసినప్పుడు ప్రత్యక్షరూపాలూ అడుగుఅద్దాలలోంచి చూస్తే, అవి టెలివిజన్ సెట్టువి గనక, పరోక్షరూపాలూ ఏకముహూర్తంలో కనిపించేటట్టు చేస్తారనిన్నీ, అప్పుడు ప్రత్యక్ష పరోక్షాలుగాని, లేకపోతే పోనీ సగుణనిర్గుణబ్రహ్మల్నిగాని ప్రతీ దుర్గుణబ్రహ్మ చూడవచ్చుననిన్నీ, పైన వాడిష్టంఅనిన్నీ, తెలుస్తుంది.

---

# అయోమార్గ విమర్శ

ఒకనాడు ఒక రైల్వే సంధిలో రైలెక్కి కూచున్నాను. వెడుతున్నానో వస్తున్నానో! - బహుశా వస్తున్నాను గావును, అవునవును వస్తున్నాను. ఇటే, డౌన్! సాయంత్రం పొద్దుబాగా వాలిపోయింది. కిటికీకి చేరువుగా ఒకమూల కూచున్నాను. కాస్త ఉమ్మేసుగున్నా చేసినా, ఎప్పటికప్పుడు మారిపోతూన్నట్టు గోచరించే పొలాలూ గట్రా చూసినా ఇష్టైనా, శూన్యంకేసి నిదానిస్తూ ఆలోచించుగున్నా నిద్దరోయినా, కిటికీదగ్గరనా ఉంటేనే నయం అని, ప్రతీవాళ్ళకీ ఏమోగాని, నాకు అనిపిస్తుంది. ఎక్కడి కక్కడికే! ఆ ఉన్న దిక్కుమాలి చెరలో ఆ కిటికీదగ్గిర జానెడు స్థలం దొరకడం కొంచెం స్వాతంత్ర్యం. ఆవేళ ఖాళీగానూ ఉంది. అన్నట్టు అప్పుడు ఇప్పటంత రైలు రద్దీ లేదు, అర్జెంటూ లేదు, వేళ్ళాడ్డాలూ లేవుగా! పెట్టిలో జనం హానిహానిగా ఉన్నారు గాని, నన్నెరుగున్నవా ళ్ళెవరూ మాత్రం లేరు. అయినాసరే, నా వార్తాపత్రిక నేను పైకి తియ్యలేదు. తీస్తే క్షోభ ఏమిటంటే, మసల్ని ఎరగని ఆంధ్ర ధనికులు కూడా పేపరు 'ఒఖ్ఖమాటు' కోరి దానంపట్టి చదువుతారే కాని మానసిక క్షుద్బాధ పరాయివాడి ఖర్చుమీద తీర్చుగోడం అధమాధమం అనేసంగతి ఆలోచనే చెయ్యరు. మరి పుస్తకాలు పైకితీసినా అంతే! తెలుగువైతే, తెలుక్కి దిక్కులేదు గనక, అడక్కుండానే తీసుకోడానికికూడా ఇతరులకి

హక్కుందిట. ఇంగ్లీషువైతే, ఇతరులు అడిగి మర్యాదగా బలవంతపెట్టి గడుసుగా చదువుకుని తమరుదిగి వెళ్ళిపోయే దాకా మాత్రం అట్టే పెట్టుగుని, వందనాలతో వాపసుచేస్తారు. అందు కని, వింతభాషలో పుస్తకం చూస్తూండడం తెలుగు రైల్లో కర్తవ్యం. సరి, రైల్లో చదువుకోసం అంటూ భాష లెక్కడ నేరుస్తాం గనక ! ఆ మామూలు పుస్తకాలకే అట్టలు వేసి మాటెట్టుగుని ఎల్లానో తంటాలుపడతాం. ఏమైతేం, రైల్లో పుస్తకాలు విస్తారంగానే చూడచ్చు, చూస్తూంటాను. సరి, ఆరోజున, ఒక ఉర్దూ గణితం గావును పైకి తీసి, సంచీ కట్టులోంచి ఓకిల్లీ కట్టి వేసేసుగుని, పుస్తకం విప్పి చూస్తూ కూచుంటిని గదా, అవతలకాను ఎదరకిటికీ దగ్గిర నే నెప్పుడూ ఎరగని ఇద్దరు వ్యక్తులు నాపుస్తకం పై అంచుమీంచి నాకు గోచ రించారు. ఒకఅతను పేనుమీసంతో సళాకుగా ఉంటే రెండో అతడు కుదిమట్టంగా ఒఖ్ఖరవ్వ పిప్పళ్ళబస్తాలా ఊరుకోడమే కాక ముక్కుక్రింద నక్కల్లాంటి పరకమీసం కూడా పెట్టించాడు. మొదటి అతడి జుట్టు, కోతకొచ్చి వాలిపోయిపడుకున్న పైరులా ఉంటే, రెండో అబ్బిది ఖరాగా ఉంగరాలే. మొదటి ఆసామీ దగ్గిర కొరడాఉంది, రెండో ఘటందగ్గిర మెలికిలు తిరిగిన కొంకి బెత్తం ఉంది. ఇద్దరూకుడా ధూమపానం చేస్తున్నారు. వాయువు నోటితో గ్రహించి యథాశక్తిగా కుంభించి ముక్కుతో వొదిలేస్తూ వేదోక్తంగా వాళ్ళు చేసిఉంటే వాళ్ళరోగాలు వాదించి వాళ్ళ క్షుద్బాధకుడా తగ్గిపోవలిసిందే

గాని, ఆచరణ యావత్తూ అక్షరాలా యథావిధిగా ఉన్నా, అప్రత్యక్షవాయువు బదులువాస్తవిక ధూమం వాళ్ళు స్వీకరించడంవల్ల ఫలితాలగురించి నాకు సందేహం తోచింది. చఛ, నేనెవణ్ణి వాళ్ళఆనందం కాదనడానికీ, విమర్శించడానికీ అనుకుని నేను యథార్థంగా పుస్తకంచదువుకోడం ప్రారంభిద్దాం అని యత్నించేసరికి సళాకులబ్బాయి నాకేసి చూస్తూ పిప్పళ్ళబస్తాని మోచేత్తో మెల్లిగా రెండుమూడుసార్లు అదమడం మొదలెట్టాడు. ఇదేదో గ్రంథంలా ఉందనుకుని, నేను కిటికీ కేసి తిరిగి ముఖం పక్కకి పెట్టుగుని వాళ్ళు వ్యవహరించుకునేటందుకు లైన్ క్లియర్ ఇచ్చేశాను. అసగా వాళ్ళసంగతి కనిపెట్టడానికి పీలైనంత లైన్ క్లియర్! వాళ్ళు చేసుగున్న సంజ్ఞల్ని బట్టి తమరనుకున్న మనిషి నేనే అయినట్టు వాళ్ళు ఖాయపరుచుగున్నారని నాకు అనిపించింది. వాళ్లు తమరి మనస్సులో ఎవర్నో అనుకుని నన్ను చూచి పొరబడుతున్నారని కూడా నాకు వెంటనే బోధపడింది. వాళ్ళచేతుల్లో కర్రలున్నాయి. ఉంటేం, రైలుగదా. కానీ, మనమూ వాళ్ళకి ఆశాభంగం కలక్కుండా వాళ్ళకోరిక ప్రకారమే నటిద్దాం, ఒక వేళ కర్మవశం చేత వాళ్ళు కర్రలు తిరగేసి వాదతమకంలో మన్ని దుంజావాయించినట్టువాయించే ముహూర్తం రాగానే నిజం చెప్పేద్దాం, అని నే ననుకున్నాను. నాకు బోధపడేటట్టు వాళ్ళిద్దరూ ముందు ఈరీతిగా ఉపోద్ఘాతం ప్రారంభించారు:

స — అల్లా పదరా, మొహాం ఈడిచి కనుక్కుందాం.

బ — ఉండరా, నిమ్మణం.

స — నిమ్మణం ఏమిట్రా, చీరేస్తాను. భయమా? ఏం జేస్తాడు?

బ — దొరికాడు, ఇప్పుడేం జెయ్యగలడులే! అయినా సరే నిదానించు.

స — నేన్నిదానించన్రా! మాటాపడి, ఛాన్సొవొదులుకుని నువ్వు కూచో!

బ — అబ్బ! ఏమనిరా అడగడం?

స — సరే, శాస్త్రం చెప్పినట్టుంది.

బ — మనకి శాస్త్రం రాదుగా, మనిది కళగా!

స — అదే, మా కళగురించి ఎందుకు విమర్శించా వంటాను. నిరుత్తరుడై ఊరుకోకూడ దంటాను.

బ — కళ గనకనే విమర్శించా నంటే!

స — నీ తాఖతేమిటి, నువ్వేవడవ్ అని అడుగుదాం.

బ — కళాసృష్టికిలాగే కళావిమర్శకి కూడా తాఖతంటూ లేదు, ప్రతీవాడూ పనికొస్తాడంటే!

స — సరిసరి. నువ్వప్పుడే వైరిదగ్గిర వకాల్తీ పుచ్చుగున్నావా ఏమిటి!

బ — కాదురా! విమర్శకుడికి హక్కులున్నాయి గనక, ఆహక్కులన్నీ సాధించుగున్నానని ఆయనంటే!

స — విమర్శకుడికి హక్కు లుంటాయన్నమాట నిజమేకాని నువ్వు విమర్శకుడ వని నీతో ఎవరు చెప్పారని మనం అంటే!

బ — మంచిరోజు చూచి నేనే అనుకున్నానని అయనంటే!

స — అయినా సరే చెడ్డరోజొచ్చింది, జవాబు చెప్పాలని మనం అంటే! తీరిపోదూ? నువ్విక్కడే కూచో మీనమేషాలు లెఖ్ఖెడుతూ!

అంటూ సళాకు నాసరసని వచ్చి కూచున్నాడు. బస్తా అబ్బాయికూడా అనుబంధం చేత స్థైర్యంతెచ్చుగుని వచ్చి నే కూచున్న కానులోనే ఎసటి చెక్కమీద అధిష్ఠించాడు.

స — (నాతో) ఎందుకయ్యా, మీకు మామీద ఈర్ష్యా! అని (కొరడా గుప్పిడిలోంచి కమ్మేచ్చు లాగాడు.)

నాకిక్లీవసంతం నామీదగాని, వాళ్ళమీదగాని పడకుండా నేను నోరు పైకెత్తి, 'లేదు' అనడానికి యత్నించి బ్రహ్మాండం మీద 'లేదు' అనేటట్లుగా దాన్ని ఉచ్చరించి, నాహృదయంలో ఈర్ష్య ఎంత మాత్రమూ లేదని ఇంకా స్పష్టంచెయ్యడానికి చెయ్యితిప్పి, మీరిద్దరూ ఎవరు అని అడగడం వ్యక్తం అయే లాగు ఒకరితరువాత ఒకర్ని చూపిస్తూ, కుడిగుప్పిడి ఊగించాను.

స — (బస్తాతో) చూడరోయ్! వీడి ఫార్సు. మన్ని ఎరగనే ఎరగట్ట.

బ — ఎరక్కపోడం ఏం రోగంరా, నిక్షేపంలా ఎరుగును.

స — మామీద అనృతాలు రాయడానికి నీకు మేం చేసిన ద్రోహం ఏమిటయ్యా?

నే — (మూతి పైకిపెట్టి) నేను, గొప్పవాణ్ణి, నాకు పాకుళ్ళండి.

స — అయినా సరే మామీద నీఅభిప్రాయం కావాలని దేశం ఎప్పు డేడిసిందీ?

నే — (పైకేచూస్తూ) నీకళ? (అనేమాటలుమాత్రం పలక గలిగి, 'కావాలని మట్టుకు దేశం ఎప్పు డేడిసిందీ?' అని అర్థం అయేట్టు సంజ్ఞచేశాను)

స — నాకళ నీకు ఒఖ్ఖడికీ బాగుండకపోతే ఏం కొంపమునిగిందీ? తక్కినవాళ్లకి బాగుండకూడదంటూ శాసిస్తావా? ఇష్టంగా భోంచేస్తూన్నవాళ్ల దగ్గిరికెళ్లి పదార్థం ఏడిసినట్టుందంటూ కక్కుగోడం ఎందుకూ తిననివాడూ, లేచిపోకా?

పల్చపల్చగా ఉన్నజనంఅంతా మేంకూచున్న భాగంలోకి వచ్చి సర్దుకున్నారు. వాళ్లిద్దరూ నన్ను తకాయిస్తూంటే నేను కిల్లీతోపాటు నీళ్లు నములుతున్నానని తక్కినవాళ్లు అభిప్రాయ పడుతూన్నట్టు నాకు గోచరించింది. నేను తగ్గసమాధానాలుచెప్పి వాళ్లని తెగ్గొట్టాలని నిశ్చయించుకుని, గర్జించి సకిలించి కిల్లీ యూవత్తూ ఉమ్మేశాను. దిక్కుమాలి ఈదురుగాలినూలాన్ని నా మొహంనిండా చినుకులు పడ్డాయేమో, కళ్లుకూడా కలికంవేసి నప్పటికిమల్లే భగ్గుమన్నాయి. నాకు నిజంగా మనిషికొచ్చినంత కోపం వచ్చేసింది. అగ్గై పోతూ, నేను తీవిగాకూచుని, సఖాకుతో-

నే — ఏమిటండీ మీారు నన్నడిగేదీ?

స — మాకళమీాద అసంపూర్ణంగా, అసందర్భంగా, అర్థ కుసిగా, అధ్వాన్నంగా, అర్థంచేసుకోకుండా మీారు ఎందుకు శాశారని.

నే — నేనేమీ వ్రాయలేదే!

స — బరితెగి రాసి అబద్ధాలుకూడా ఎందుకయ్యా! నాజూకుగా విషం కక్కుగున్నాననీ, సూక్ష్మశ్రమతో సూక్ష్మకాలంలో పేరులాగాలని యత్నించాననీ అనరాదూ తీరిపోతుందీ !

బ — పోనీ చేతగానితనంవల్ల అని ఒప్పుగోకూడదూ!

స — జనాదరణకి ఏది లక్ష్యమో దాన్ని ఛీఛీ అనేస్తే తద్వారా జనదృష్టిలో పడచ్చుననిగావును తమరిసంకల్పం!

నే — కాదు, నాసంకల్పం వేరు.

స — వేరుకాదు. జనదృష్టిలో పడడానికి కాకపోతే నీ ప్రకటన లెందుకూ?

నే — నాసరదా ఉండబట్టలేక.

స — మంచి సంగతే. సరదాలు ఊళ్లోనామరీ !

ఏదో స్టేషను రావడంవల్ల రైలాగింది. నేను ఒకసోడా పుచ్చుగుని, కిల్లీ కట్టు గోడానికి యత్నిస్తూ, వాళ్లు దిగవలసింది ఆస్టేషనేమో అని కనుక్కున్నాను. నన్ను గోదావరివంటిచోట దింపందీ తమరు దిగరన్నాడు బస్తాఅబ్బాయి. బాగా అన్నాడని మెచ్చుగుందాం పోనీ అంటే, నామీదే అన్నాడాయిరి! వాళ్లునన్ను వొదిలేలాగ కనపడలేదు. ఏమిరాందారీ అని నేను చూస్తూండగా, కొందరితోపాటు, నూటువేసుగున్న ఓ టోపీ ఆయన మాపెట్టెలోకి వచ్చి మాకు ఎదర అవతలకానులో కూచున్నాడు. నా ప్రతికక్షులు ఆయన్ని ఎరుగున్నట్టు దాఖలాగా ముఖాలు విప్పారు. ఆయన 'ఇదుగో, ఇంటికేనా!'

అన్నాడు. సళాకు అవుసన్నాడు. వాళ్లు కుశలప్రశ్నలుకానిచ్చు గుంటున్నారు. నేను కిల్లీ కసబిసా కోపంగా నమిలి పారేసి, వాళ్లకళ ఏమైఉంటుందా అని బుర్రచించుగుని వాళ్ల మొహాలమీంది కళనిబట్టి వాళ్లది టాకీకళగాని, గ్రామఫోను కళగాని అయివుంటుందేమో (అప్పట్లో రేడియోకళ లేదు గనక గాబును) అనుకున్నాను. అల్లాయితే వీళ్లు నామీంద తప్పకుండా పొరపాటునల్లే విరుచుగుపడ్డా రనుకున్నాను. ఒక వేళ నటులేమో అంటే వాళ్లు నన్నుగాని, నేను వాళ్లనిగాని గుర్తించుగోలేని అవస్థరాదని నాకు తెలుసు. గానమో, కవనమో వాళ్లకళ అనుకోడానికి నాకు ఆస్కారం కనిపించలేదు. ఈ కాస్సేపట్లోనూ ఆటోపీ ఆయనకికూడా వాళ్లు తమ ప్రస్తుతపు పని బోధపఱిచి ఆయన్నికూడా తమలో కలుపుగుని ముమ్మరంగా తయారయారు. ఇక్కడికిముగ్గుర్నీ కూర్చొవుట్టా ప్రభో అనిపించి, నేను వాళ్లు అనుకునేవాణ్ని కాను అని చెప్పేసి బయటపడదా మనుకున్నాను. కాని, వాళ్లు నమ్మకంగా కూడబలుక్కున్నట్టు, ఒకడు ఆగేసరికి రెండోవాడు, వాడు మానేసరికి మూడోవాడు, వాడుతగ్గేసరికి మళ్లీ మొదటివాడు ఇల్లాగ్గా ఉప్పు అందిపుచ్చుగుంటూ చక్రక్రమంలో తెంపులేని ధోరణిలో పడిపోయి నన్ను దుయ్యబట్టుకుని, నోటికొచ్చినట్టు తమవుకోకుండా మాటలూ, చేతికొచ్చినట్టు స్వేచ్ఛగా ఆయుధాలూ, (మొదటివాడు కొరడా, రెండోవాడు కొంకిబెత్తమూ, మూడోవాడు గొడుగు టోపీ)

ప్రయోగిస్తూ వ్యవహరించి, నాకు ఊపిరిసలపకుండా, మెడ నిలవకుండా చేసేశారు. వాళ్ళమాటల్లోని ప్రపంచమాత్రం వొదిలి వృత్తాంతం పోగుచేస్తే, ఇల్లాఉంది:

స — చటుక్కున చెప్పండి! మీఉద్దేశంఏమిటి? విమర్శించడం అంటే అభిమానంకొద్దీ పీలుచేసుకుని వందిలాపొగిడి, లేకపోతే అసూయకొద్దీ కసాయిలా నరకడమా? దూదిని లా ఏకడమా, పందినిలాబాదడమా, శవాన్నిలా పాతెయ్యడమా? కళాకర్త మచ్చమాపడమా? దోషాలగురించి తంటసం పట్టించడమా? పాతసూత్ర శవప్రమాణాలతో కళాజీవాన్ని కొలవడమా? పాతఅర్థమూ కొత్తఅర్థమూ ఏదీ తేలకుండాఉండే పారిభాషికపదాలు ప్రయోగించి మాట్లాడడమా? ఒకేఉదాహరణతో సూత్రించడమా? 'మంచి' 'చక్కని' 'అందమైన' 'సుందరమైన' 'బాగాఉండే' 'ఉచిత' వంటిపదాలు బతికున్న వాళ్ళందరికీకూడా మీఒక్కరికే ఎంతఅర్థం ఇస్తాయో అంతే అర్థం ఇస్తాయనుకుని భ్రమించి వాడెయ్యడమా? ఇల్లాయితే బాగుండేది, అల్లాయితే ఫసందుగా ఉండేది, జాకీదిగితే అటనెగ్గి ఉండేది, పొడిఆడిఉంటే బేస్తునెగ్గేది అన్నట్టు జరిగినయథార్థం జరిగినరీతిగా జరిగిఉండకూడదని వాపోవడమా? మొగపెళ్లివారితనం అభినయించడమా?

బ — అందుకనే, నన్నడిగితే, కళావిమర్శ వ్యర్థం. కళకీ ఆరగించేవాళ్ళకీ మధ్య ఇరుక్కోడం బతికేందిలేని వరకం. మధ్య నుండి యథార్థం చెప్పవచ్చంటారా? చూడండి. ఉన్నది

ఉన్నట్టూ, ఉన్నదిలేనట్టూ, లేనిదిఉన్నట్టూ, లేనిదిలేనట్టూ 'చెకుముకిశాస్త్రి' చెప్పినట్టూ! ఉన్నకళని ఉన్నట్టుమీరు చెప్పలేరు అదేచెప్పాలిగాని. మీరుచెప్పబూనడం హాస్యాస్పదం, చెప్పడం అసంభవం. కళాశరీరాన్ని ముక్కలకిందకోసి మరో రూపంలో అజ్ఞానులకి వడ్డించి ఎల్లాఉంచసడం ఘోరనేరం. ఉన్నది లేనట్టు చెప్పడం స్వామిద్రోహమూ, మాత్సర్యమూ గనక అది కళాభిమానులకి తెలిసిపోయే దౌర్జన్యం. లేనిది ఉన్నట్టు బ్రహ్మాజులతంతుగా చెబితే, విమర్శ ఏకమొత్తంగా కుక్కముట్టుగుపోతుంది. లేనిదిలేనట్టు చెప్పడం మొదలెడితే ఆయుర్దాయాలుచాలవు. ఉండేసింది చెప్పడానికి విమర్శ కేవల చరిత్రకాదు, ఉండబోయేది చెప్పడానికి కేవలజ్యోతిషం కాదు. ఉండవలిసింది చెప్పడానికి కేవలశాసనం కాదు, ఉండ తగ్గది చెప్పడానికి కేవలనీతిపాఠం కాదు, నాయి ... డానికి ఇంట్లోముచ్చటకాదు.

టో — ఉండాలి ఉండాలి. విమర్శ అంతగా అనవసరంఅని నేను నమ్మను. దానిఉదయం కళాతరంగం పూర్తిఅయినతరవాత! కళకి భావన ఎల్లాగో విమర్శకి విచక్షణ అల్లాగ! కళ బాల్య సూచకం, విమర్శ వృద్ధత్వచిహ్నం. కళ జనకం అయితే విమర్శ జన్యం. దీర్ఘమననమూ, కళాకర్త హృదయావగాహన గురించి నిరంతరాలోచనా, నిదానం, సుముఖత్వం, హృదయవైశాల్యం, అహంకారరాహిత్యం, కళలోఉండగల ప్రత్యేకమహాత్మ్యాన్ని కనిపెట్టడానికి ఓపికా, మన్నించడానికి వినయమూ, సాటించ

డానికి కుతుహలమూ, చెప్పడానికి తాఖతూ, తోడగడానికి భాషాగల వ్యక్తిచేసే కళావిమర్శ కూడదనే మానవులుండరను కుంటాను. అటువంటిది వీరివల్ల కొంతమాత్రాన్ని ఆపనే కూడదని చెప్పిపారెయ్యడం సమంజసంకాదు.

ఈ సమయంలో నాకు మరి కోపం ఆగక, తారస్థాయిలో మనమూ అందుకుందాం అని లేచాను. ఇంతలో రైలాగితే కూచోపడ్డాను. తక్షణం మళ్ళీ లేచి 'ఏయ్ సోడా' అని కేకేసి "ఉండండి, మీామాటేమో గాని నాకు దాహం వేస్తోంది" అని పెట్టి గుమ్మందగ్గిరికి పరిగెట్టి సోడా కొట్టించి పుచ్చుగుని డబ్బులిచ్చేసి గబగబా వచ్చి కూచోడంలో మొహం మహ జోరుగా పెట్టేశాను.

నే — అయ్యా ! ఒకటిరెండు మూడులారా ! ఏమిటి మీా నిర్బంధం ? నన్నేం జెయ్యమని తమసెలవు ? తమరి దస్త్రాలు కట్టేసినట్టేనా ? ఏం జెయ్యమన్నారు ?

స — ఇంకా చెయ్యమని కాదు. వెనక తమరు చేసిన దాన్ని గురించే ! మామీాద కళ్ళు మీాలోపలఎందుకు పుట్టి పెరిగిందీ అని.

నే — నాలో కళ్ళు చిన్నమెత్తైనాలేదు. నే సత్యం చెప్పే స్తున్నాను. నేను మీామీాద ఏమీా రాయలేదు. మీారు నన్ను చూసి ఎవరో అనుకుంటున్నారు.

స — అదిగో మళ్ళీ ! నాలికా తాటిపట్టెయ్యా? మీావేరు ఫలానాకాదూ ?

నే — అవును.

స — అయితేమరిఇహ నేం! మేంపొరపాటు ఎక్కడపడ్డామూ? సమాధానం చెప్పండి, లేకపోతే క్షమాపణేనా కోరుకోండి.

పూర్వవిషయం ఏదీ నాకు స్ఫురించలేదు. వాళ్ళ పేర్లు కనుక్కోడానికి నాకు అసహ్యం వేసింది. నేప్రకటించిన ఉమ్మడి వాక్యం ఏదో స్వంతానికి అన్వయించుగున్న వ్యక్తులేమో వీళ్ళు అనుకున్నాను. అయినా, వాత్రిఫుణ్యానికి క్షమాపణ కోరుకోడానికి నామనస్సుని నేను నచ్చగొట్టలేక ఇల్లా అన్నాను:

నే — నేను తప్పుచెయ్యలేదుగనక క్షమాపణ కోరుకోను. కాస్కోండి, వినండి: విమర్శ నాయిష్టం. మీయిష్టం మీదైతే నాయిష్టం నాది. నాపని నాకు జన్మహక్కు! మీరు ఉన్నవే చూడలేనివాళ్ళయితే, నేను లేనివికూడా చూడగలను. కళకి చీడపడితే నేను చూస్తూ ఊరుకోలేను. అభిరుచులు పాడవుతూంటే నేను భరించలేను. నేను ముళ్ళడొంక ఛేదిస్తాను, కుళ్ళు చెత్త కడిగేస్తాను, 'అంగవ్రాతములో చికిత్సకుడు దాదుష్టాంగంబు ఖండించి' — జాగ్రత్త — నాదృష్టిలో కళాకర్త మొదటి ముద్దాయీ, వాడికళ రెండో ముద్దాయీకాగా, వాదీ, వాది ప్లీడరూ, ప్రతివాదీ, ప్రతివాదిప్లీడరూ, సాక్షులూ, ఉత్తర సాక్షులూ, దక్షిణసాక్షులూ, పంచాయతీ, జడ్జీ — ఇవన్నీ నేనే, లక్ష్మణకవే అవతలకథలో లక్ష్మణుడూ, రాముడూ, ఆంజనేయులూ అవుతూన్నట్టు! ఘోరకృతులు చేసిన కళాకర్తని నేను ఉరితీసిపారేసి ఆంధ్రజనానికి వాడివల్లరాగల అపాయం తొలగిస్తాను. నన్నాశ్రయించడాన్ని బట్టి నేను కళాకర్తల్ని పైకితీసుకు

రాగల్ను. అవసరాన్నిబట్టి నేను తప్పుల్ని గొప్పచెయ్యగల్ను, లేకపోతే ఒప్పుల్ని కప్పెట్టగల్ను. కళాకర్తలంతా తరవాత తరవాత వారసత్వంగురించి తన్నుకుచావకుండా ప్రతీవాడికీ తలోజాగా కేటాయించి వాళ్ళకి చీడీలుకట్టేసి ఉచితస్థలాల్లోకి వాళ్ళని జేరేసి, నాఅనుజ్ఞ లేకుండా వాళ్ళు పైకి ఎగరడానికిగాని కిందికిపడడానికిగాని వీళ్ళు తగ్గిపోయేటట్టు వాళ్ళని మేకుబందీ చేసి పారేస్తాను. ఎక్కడేనా బావగాని వంగతోటదగ్గిర కాదన్నట్టు కళాకర్త నాకు ఎంతదగ్గిరచుట్టం అయినాసరే, ఎంత ఎకుగున్నవాడైనా సరే కళలో పస లేనప్పుడు నిర్మోహమాటంగా వాణ్ణి తెగ విమర్శించి విమర్శించి వొదిలిపెడతానుగాని ఊరుకోను. అందుకని గుంజాలేనివాళ్ళకి నేనంటే తార్ ! నాకు సన్మానం జరిగినప్పుడు 'సుకృతికుఠార్' అనే బిరుదం నాకిస్తే నేను అభ్యంతరం చెప్పనని చాలామంది అనుకోడమూ, ఊహించుకోడమూ నాకు తెలుసు. నాతాఖతుగురించి మీరు దుఃఖించకండి. నాఅంత జ్ఞాని విమర్శపాటి చెయ్యడా? అందులోనూ కళావిమర్శ చెయ్యడానికి ఆకళ రానక్ఖర్లేదు అనికాదు నేననేది, ఆ కళ వచ్చిఉండకూడదు అనికూడా నొక్కుతాను. అప్పుడుగాని ఆ కళయొక్క అసలు నిగ్గు తేలదంటాను. పాఠం విమర్శించడానికి పాఠం చెప్పని ఇనస్పెక్టరే తగునని నా అభిప్రాయం. తెలుగుగానవిమర్శకి హైందవేతరుడు చాలు, తెలుగుచిత్రవిమర్శకి ఆంగ్లయ్య ఉండాలి, తెలుగుకవితా విమర్శకి అరవయ్యరు నిరాక్షేపణంగా ఉండచ్చు, సరి తెలుగు నాటకప్రదర్శనవిమర్శకి స్పృహాలేనివాడు మరీతక్కువ సరి

పోతాను. సత్తా లేకపోతే మీరు కళ మానుకుని మరోపని చూసుకోండి. మీరు చవటకళ సృష్టిచేసినన్నాళ్ళు నేను తీవ్ర విమర్శ మానను. ఎక్కేగుమ్మమూ దిగేగుమ్మమూ మోస్తారై మీరు ఎవరిదగ్గరికి ఎన్నిసార్లు వెళ్ళి ఎంతపడుచుకున్నా నా వాతలు నేపెట్టితీరతాను. మరి నే దిగేస్టేషను వచ్చేస్తోంది. జ్ఞాపకం పెట్టుకోండి.

స — చాల్లేవయ్యా! ఆకారమా నీ కాధారం? నామాలా నీకు ముఖ్యం? నీమాలా నీకు శరణ్యం? రూపాలా నీకు జీవం! ఆత్మఘోషణా నీ అంతర్యవృత్తి? వ్యక్తిదూషణా నీపరమావధి? సంకుచితత్వమా నీజ్ఞానం? నీచసాపత్న్యాలు తెచ్చావు నువ్వు ఒకడి ఔన్నత్యం స్థాపించడం! నీమనస్సులో ఉందని నువ్వు అనుకునేదా నీకు ప్రపంచంలో సందర్శించవలిసిన కళ? నువ్వు కళాచార్యుడివా అల్పులకి కళోపదేశం అడక్కుండా చెయ్యడానికి!

బ — అయ్యా! కళాప్రారంభకుణ్ణి విమర్శించడం పిచ్చికమీద బ్రహ్మాస్త్రం ప్రయోగించడం. కళావర్తకుణ్ణి విమర్శించడం చెవిటివాడికి శంకూదడం. కళారాధకుణ్ణి విమర్శించడం కమ్మరవీధిని సూదులమ్మడం. కళాజీవిని విమర్శించడం పొట్టమీద కొట్టడం. స్థిరపడ్డ కళాకర్తని విమర్శించడం ఏటికి ఎదురీదడం. కంటున్న కళాకర్తని విమర్శించడం చెవులోని జోరీగఅవడం. అల్పుడైన కళాకర్తని గొప్పగా విమర్శించడం వాడితోపాటు అథోలోకానికి టిక్కట్టు కొనుక్కోడం. ఊరుకుంటే చాలా సంగతులు సవ్యంగా పరిష్కారం కాగలవ్. ఉత్తమకళాకర్తకి విమర్శ మోకాలి బంటి. అధమకళాకర్తని

అనామకంగా విడిచి పెట్టడం ఉభయతారకం.

టో — అబ్బ! నువ్వు విమర్శ అంటే చెడు అర్థమే లాగు తున్నావయ్యా! అదేం ధర్మం! విజ్ఞానాన్ని బట్టి అన్నిటి లోనూ మాత్సర్యం తగ్గించుగోవాలి. విమర్శ అంటే, వెనకటి మల్లేనే నెత్తిమీద మొట్టికాయ కాదు, మొహంమీద చెప్పు కాదు, కంఠానికి ఉరి కాదు, నోట్లో ఘ్రుంకు కాదు, వీపుమీద చరుపుకాదు. "బాహ్యస్థితిగతులవల్ల తన చిత్త వృత్తిలో గలిగిన పరివర్తనలు అన్యహృదయాలకి కలిగించా లనే సదుద్దేశంతో కళాకర్త చేసే ప్రకటనని వ్యాసంగం చేసు గోడమే" విమర్శ. కళాకర్తయొక్క భావనాశక్తికీ, విచక్షణకీ సమత సమర్థించడం విమర్శ. ఆంతర బాహ్యచరిత్రల్ని పరి శీలించి, ఏదైనా కృతిజనించడానికి దేశకాలపాత్ర సందర్భాలు ఎట్లు పరిపక్వం అయినాయో, మరి ఆ కర్తే ఆ కృతి రచించ డానికి పరిస్థితులు ఎట్లా అనుకూలించాయో కనిపెట్టడం విమర్శ. అనేకకృతులు రచించడపు పనిలో కళాకర్త పడిఉండే టప్పుడు వాటిని విడివిడిగా దేనిమట్టుకి దానిని సమగ్రంగా ఆస్వాదించ డపురీతి చెప్పడానికి ఒక్కొక్కకర్తకి వ్యవధీ, ఒక్కొక్క కర్తకి నేర్పూ, ఒక్కొక్కకర్తకి ధైర్యమూ, ఒక్కొక్క కర్తకి నిర్మోహమాటమూ చాలవుగనక అటువంటి పని చెయ్యగలగడానికి విమర్శ అవసరం అంటాను. కళని విమర్శించే వాడు కర్తయొక్క నిజమైన అవస్థ గ్రహించడానికి కర్తవంటి వాడై, తరువాత ఎంతో క్షోభ పడ్డమీదట కర్తయొక్క హృదయస్థితి వహించగలిగితే, అక్కడికి అతడికి ఇల్లలకడం

అయి, స్వంతపని యావత్తూ మరి ముందుంటుంది. ఒక సార్థకకళలోని ప్రతిభ కర్తేవచ్చి చూపించేకంటే మరొకరొచ్చి ప్రకటించినప్పుడు కూడా ప్రజల్లో కళాసక్తీ, కళారాధనా హెచ్చుతాయేగాని తగ్గవు. నిశ్చయమైన తేజస్సుగల కళ తన చుట్టూగల అనేక జనాజ్ఞాన మేఘాలవల్ల మాటుమణిగి పోయినప్పుడు వాటిని పటాపంచలుచేసి ఆ కళయొక్క తేజో లాభం ప్రపంచానికి కలగచేసేప్రభంజనం విమర్శ. కర్తయొక్క హృదయ విహారాన్ని కర్తకంటేకూడా ఎక్కువ వివరాలతో కూడా గుర్తించగలిగాడా ఇతడూ అనిపించగలవాడు అన్నదే విమర్శ. క్రౌర్యంలేని స్వాతంత్ర్యమూ, మెట్ట వేదాంతం లేని జ్ఞానమూ, మొట్టికాయలు వెయ్యడపు సరదాలేని ఇంగిత జ్ఞానమూ, పటాటోపం లేని పాండిత్యమూ, చాటుచాటు శౌర్యంలేని త్రికరణశుద్ధీ, స్వాతిశయం లేని దర్జా, కాకిచూపు లేని దృష్టీ, మేష్టరీతనం లేని అధికారమూ, కుచోద్యంలేని హృదయమూ విమర్శకుడు కనపరుస్తాడు. సత్యసృష్టిని పోల్చుకోగలిగి, సత్యవిషయాల్ని స్వీకరించగలిగి గూఢంకాని హృద్యభాషలో కళ దొరికేచోట్లు ఇవిగోఅని చెప్పడమేకాక, చెప్పగానే జనానికి విశ్వాసంకూడా కలిగించగలిగి నెగ్గినవాడు చెప్పిందే విమర్శ.

ఇప్పటికి నాప్రయాణం చాలావరకు అయిపోయింది. మరి తరవాత స్టేషన్లో నేను దిగిపోడమే. నాకు ధైర్యంవచ్చింది. టోపీ ఆయన ఏదో శ్రమపడి ఏకరువుపెట్టాడుగాని, అదంతా నాకూ తెలుసు. అదంతా పుస్తకాల్లోదే, ఎటొచ్చీ ఏదిఎక్కడిదోఅతడు

చెప్పలేదు, సైంఇస్తే నేను చెప్పేస్తాను. చివరముక్కలు నేనే అనేసి ఆ రైల్వే సారస్వతగోష్ఠి ముగించెయ్యాలని నాకు అనిపించింది.

నే — (టోపీ ఆయనతో) స్వామీ, తమ పేరు?

టో — దాసు.

నే — నమస్కారం. మీతో నేను ఏకీభవించను. దేశాభిరుచి పాడైపోయింది. కొన్నికొన్ని మంచికృతులున్నా వేళాకోళపు రకం ఎక్కువైనాయి. వాటికి గౌరవం రాకుండా చెయ్యడం పని నామీద, నాభుజస్కంధాలమీద పడ్డది. ఒక్కొక్క కృతిలో లక్షదోషాలున్నా, మరి ఏమీ లేకపోవడమున్నా. పాడుకృతులకి తెగప్రచారం. వాటిల్లో నియమాలు బొత్తిగా లేకపోడం. అయినాసరే, జనం అల్లాంటి అధమకళల్ని పాటించి గౌరవించడం నాకు పరమాసహ్యాం వేసి, జనంయెడల జాలికొద్దీ ఈపాడుపనికి దిగాను. కలేజాఉండి మొగతనం ఉంటే సమాధానం చెప్పండి.

టో - మీరుచెప్పారుగా! మేమూ నిమిషంలో చెప్పచ్చు గాని, ఒక్కొక్క సమాధానంవల్ల అల్పవిమర్శకి అనవసరపు గొప్పతనం వస్తుందేమో అనేభయంవల్ల మాట్లాడక ఊరుకోడం జరుగుతూంటుంది.

ఇంతలో మావూరు స్టేషన్ తాలూకు 'కులీ, కులీ, కులీ!' వినబడింది. రైలాగింది. నేనుదిగేసి దాసుగారితో,

నే — సెలవండి. తమకి సోడాకావాలా?

టో — చిత్తం. అక్కర్లేదు.

నే — (కడమ ఇద్దరితో) మీరు సోడాపుచ్చుగుంటారండీ?

స — ఎంతమాత్రంవద్దు. మీా సమాధానరసంతో మాకు నోరూరి తృష్ణ పోయింది.

నే — (వాళ్లకి నమస్కరించి) అయ్యా! మళ్లీమనం ఎప్పుడు కలుస్తామో! కొంచెం నిదానించిచెబుతారా, ఒక సంగతి అడుగుతాను.

స — అడగండి.

నే — మీామీాద నే రాసింది మీారెక్కడ చూశారూ?

స — మెడ్రాసు ఫలానా పత్రిక ఫలానా సంచికలో!

నే — ఉందా ఇక్కడ?

స — లేదండీ!

నే — నేను ఏరచనా పంపించలేదండీ, ఎల్లా అచ్చుడిందోగాని అచ్చుపడ్డరచనా? మీారు టాకీవారా?

స — అవునండీ. మాపేర్లతో ఉంటేనే! స్పష్టంగా మీా ఇంటిపేరు ఉంటేనే!

నే — నాపేరుందా?

స — లేనట్టుందండోయ్! (బస్తాతో) ఏరా?

బ — లేదు.

నే — పేరులేకుండా ఫక్తు ఇంటిపేరా! అల్లాచెప్పండి మరీ! ఆవ్యక్తి మరొకరు అయిఉండాలి.

స — మీాకు దగ్గిరవాడా?

నే — ఏమో! ఏ తూర్పు — పడమర సంబంధమో!

స — నిజంగానేనాండీ?

నే — నిశ్చయంగా.

బ — అల్లాయితే మీారుమమ్మల్ని క్షమించాలి. ఇందాక

ణ్ణించీ జరిగిందానికంతకీ బొడ్డుతున్నామలూ! మరి మమ్మల్ని విమర్శించింది మీారే అయినట్టు సమాధానం మొదలెట్టారే!

నే — ఏంజెయ్యనూ! మీారంతా అటకాయించేసరికి చేతా వాతా అయినంతమట్టుకి తంటాలుపడ్డాను. కాని, ఆ ప్రమాదంవల్లనైతేం మీాపరిచయభాగ్యం నాకుకలిగింది. కృతజ్ఞుణ్ణి. ముఖ్యంగా దాసుగారికి.

బ — అయితే, ఆయనెవరో అల్లా ఇంటిపే రెట్టుగోడం ఎందుకండీ!

నే — ఇంపుకే! లాభం ఏమన్నా ఉంటే జమకట్టుగోడానికిన్నీ, నష్టంవస్తే ఖర్చురాసెయ్యడానికిన్నీ ఏమో! లేక, అహంకారం చంపుగున్నా మమకారంవదల్లేక గావును.

బ — ఐతే చిక్కేనండీ. చాలా రచనలున్నాయే అల్లాంటివీ! వాటిల్లో అభిప్రాయాలన్నీ మీా నిశ్చితాభిప్రాయా లనుకుంటున్నాం!

నే — మరి అనుకోకండి. అటువంటి విమర్శనాశక్తి నాకు లేదు. మరిరైలుకదుల్తుంది. సరి, ఈ యినపదారివిమర్శ చాలుగానండి, ఇప్పుడిక హృదయాలు కుదటబడ్డాయిగనక సోడా పుచ్చుగోరూ?

ముగ్గురూ — అవశ్యం.

అనగా, వాళ్లకి సోడాలిప్పించి కిల్లీలుకూడా ఇప్పించి నేను నమస్కరిస్తూండగా రైలు కదిలిపోయింది.

సంపూర్ణం

# శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి

## గ్రంథాలు

సిద్ధముగ ఉన్నవి:

ఇప్పుడు
గుసగుసపెళ్ళి
పెళ్ళిటైయినింగు
రెండురెళ్ళు
అప్పుడు
కాలక్షేపం (1)
కాలక్షేపం (2)
అన్నీతగాదాలే
అవును
నిజం
మాటవరస

సిద్ధముగ ఉన్నవి:

మేజువాణి
మనతెలుగు
లోకోభిన్నరుచిః

అచ్చు అవుతున్నవి:

తనలో
కాలమహిమ
మృచ్ఛకటిక
ముద్రారాక్షసం
చంద్రుడికి
ప్రణయరంగం

వెల: దేనికదే ఒకరూపాయి

త్వరలోనే వెలువడగలవు



పబ్లిషర్సు: అద్దేపల్లి అండుకో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము